

# ఫోస్ఫోమిన్

## శక్తిని పెంపొందించును.



## ఆకలిని అధికము చేయును.

## సహనశక్తిని హెచ్చించును.



## శరీరముయొక్క రోగనిరోధక శక్తిని ఎక్కువ చేయును.

అవును —

కుటుంబము అంతటికి ఫోస్ఫోమిన్
వల్ల ఆరోగ్యము కలుగును.

ఫోస్ఫోమిన్...బి కాంప్లెక్స్ విటమినులు మల్టిపల్
గ్లిసరోఫోస్ఫేట్లుగల ఆకుపచ్చని పండ్ల రుచిగల టానిక్




SQUIBB

® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్కార్పొరేటెడ్ వారి
రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కుకు చిహ్నం: దీని లైసెన్సు
ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రయివేట్ లిమిటెడ్

SARABHAI CHEMICALS

Shilpi SC 50 A/67 Tel

పొత్తిళ్లలోని పసిపాపలకు,
మృదువైన "బ్రాడోసాల్" తో కూడిన
బినాకా బేబి పౌడరు మీ పసిపాపను
పొత్తిళ్లవల్ల చర్మం ఒరసిపోకుండా
కాపాడుతుంది.



# బిన్నీవారి D318 & D380 కేస్‌మెంట్లు

చదువుకోటానికి... ఆడుకోటానికి

స్కూలు యూనిఫారములకు ఆదర్శమైనవి

బిన్నీ D 318 & D 380 కేస్‌మెంటులతో చదవటం ఇష్టమొచ్చినంతసేపు ఆడవచ్చు. అందంగా బాగా మన్నుతాయి. రంగు దిగదు ఎన్ని ఉతుకులైనా దిట్టంగా వుంటుంది. దేశమంతటా స్కూళ్ల నిర్ణయించిన రంగులన్నీ బిన్నీ వారి దగ్గర లభిస్తాయి.

బిన్నీ D 318 & D 380 కేస్‌మెంట్లు విస్తృత వర్ణశ్రేణిలో లభిస్తుంది. ఫర్నిషింగు బట్టలకు, కుషన్ కవర్లకు, గుమ్మాల తెరలకు అందంగా వుంటాయి.




**బిన్నీ-బట్టలకు పెట్టినది పేరు**

BY-4614

తప్పక చూడండి!

ఇంటింటా ప్రతి నిత్యం జరిగే సంఘటనలతో
"ఇది మన యింటి కథా"? అనుకునే భ్రమతో "ఆహా! ఎంత
కరుణామయ గాథ" అని అందరూ చెమ్మగిల్లిన కళ్లతో చూచి,
చివరకు ఆనంద భాష్పాలతో ప్రశంసించే కథావస్తువు

శ్రీదేవి కంబైన్సు

# చుట్టరికాలు

కథ: త.రా.సుబ్బారావు, మాటలు: పాలగుమ్మి పద్మరాజు
పాటలు: దాశరథి. కొసరాజు. శ్రీశ్రీ. సి.నారాయణరెడ్డి. సంగీతం: ఘంటసాల
కెమేరా: చిట్టిబాబు ఆర్టు: వాలి. ఎడిటింగ్: బి.గోపాలరావు డ్యాన్సు: జయరాం
నిర్వహణ: N.V.సత్యనారాయణ. ప్రొడక్షన్: వెంకురామయ్య

దర్శకత్వం: పి.కేటి శివరామ్, B.A., నిర్మాత: తోట సుబ్బారావు



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ [ "వీరగంగడు" ] టి. యస్. వెంకటేశమూర్తి రచన. ఇది చక్కని నీతిగల కథ. శౌర్య పరాక్రమాలు లేని రాజులకన్న అవి ఉన్న సామాన్యుడే అన్నివిధాలా మేలని ఈ కథ చెబుతున్నది.

ధన కాంక్షకు ఏదో ఒక అడ్డు ఉండాలి. లేకపోతే అది ఎక్కడికి దారి తీస్తుందో చెప్పలేం. "లక్షలసమస్య" అన్న కథలో ఒక మూఢవిశ్వాసం అలాటి అడ్డుగా పనిచేస్తుంది.

సంపుటి 43 జూలై '68 సంచిక 1

CHITRA



# భారత చరిత్ర



గడచిన యుద్ధాలలో పొందిన అపజయాలతో టిప్పుసుల్తాను చితికిపోయాడనీ, అతను ఇక తల ఎత్తలేడనీ ఇంగ్లీషువారు అనుకున్నారు. అయితే ఇది భ్రమ అని త్వరలోనే రుజువయింది.

టిప్పు అపజయ పరాభవాన్ని దిగమింగి ఊరుకునే మనిషికాడు. దానికి తోడు అతనికి ఇంగ్లీషువారంటే తీవ్రమైన ద్వేషం కూడానూ. అతను చురుకుగా యుద్ధనష్టాలను చక్కబరచుకున్నాడు; తన కోటను మరింత బలిష్ఠం చేసుకున్నాడు; తన అశ్విక దళాలనూ, పదాతిసేననూ వృద్ధిపొందించుకున్నాడు; కూడిరాని సామంతులను శిక్షించాడు; దేశాన్ని యథా పూర్వస్థితికి తెచ్చాడు.

ఆ సమయంలో యూరపులో ఇంగ్లీషు వారికీ ఫ్రెంచివారికీ తీవ్రమైన యుద్ధం జరుగుతున్నది. రాజకీయజ్ఞుడైన టిప్పు, భారతదేశంలో ఇంగ్లీషువారికి ప్రతిగా ఫ్రెంచివారి సహకారం పొందటానికి కృషి చేశాడు; తాను ఫ్రెంచివారి జాకొబిన్ క్లబ్బులో సభ్యుడుగా చేరాడు; తన కింద కొలువున్న ఫ్రెంచివారి చేత ఫ్రెంచిరిపబ్లిక్ జెండా ఎగరవేయనిచ్చి, శ్రీరంగపట్టణంలో "స్వాతంత్ర్య వృక్షం" నాటింపజేశాడు. రాబోయే యుద్ధంలో తన పక్షాన ఉండమని అర్థిస్తూ టిప్పు, అరేబియాకూ, కాబూలుకూ, కాన్‌స్టాంటినోపులుకూ, ఇతర దేశాలకూ దూతలను పంపాడు; భారతదేశం నుంచి ఇంగ్లీషువారిని వెళ్ళగొట్టటానికిగాను వలంటీర్లు ముందుకు రావలసిందని ప్రకటన కూడా చేశాడు. ఈ ప్రకటన ఫలితంగా, 1798 ఏప్రిలులో కొందరు ఫ్రెంచివారు మంగళూరులో దిగారు.

ఆ నెలాఖరులోనే మద్రాసు వచ్చిన ఇంగ్లీషు గవర్నరుజనరలు వెలస్లీ, టిప్పు

**82. టిప్పుసుల్తాను పతనం**



విద్రోహం తలపెట్టినట్టు పసిగట్టి, తక్షణమే టిప్పుతో యుద్ధానికి తగిన సన్నాహాలు చేశాడు. ఆయన త్రిపక్ష ఒప్పందం కింద మళ్ళీ నిజామునూ, మహారాష్ట్రులనూ ఆహ్వానించాడు. నిజాము సెప్టెంబరు 1న ఇంగ్లీషువారితో ఒక ఉపసంధి చేసుకున్నాడు. మహారాష్ట్రులు మాత్రం వెలస్లీకి స్పష్టమైన సమాధానం చెప్పక, నీళ్ళు నమిలారు. యుద్ధంలో లభించే లాభంలో కొంత భాగం పేష్వాకు ఇస్తామని కూడా వెలస్లీ అన్నాడు.

టిప్పుకూ, ఇంగ్లీషువారికీ జరిగిన ఈ యుద్ధం చాలా క్లుప్తమైనది. 1799 మార్చి 5న, శ్రీరంగపట్టణానికి పడమరగా 45 మైళ్ళు దూరంలో ఒక యుద్ధమూ, మార్చి 27న శ్రీరంగపట్టణానికి తూర్పుగా 30 మైళ్ళ దూరంలో మరొక యుద్ధమూ జరిగాయి. టిప్పు రెండింటిలోనూ ఓడిపోయి శ్రీరంగపట్టణానికి తిరిగి వచ్చాడు. మేనెల 4న ఇంగ్లీషువారు శ్రీరంగపట్టణాన్ని పట్టుకున్నారు. తన రాజధానిని కాపాడుకునేటందుకు టిప్పు వీరోచితంగా పోరాడి, కోట ద్వారం వద్ద ప్రాణాలు వదిలాడు. అతను గుండు దెబ్బ తగిలి పడిపోయి ఉన్నసమయంలో ఒక ఇంగ్లీషు సైనికుడు టిప్పు



నడుముకు ఉండిన వజ్రాలు పొదిగిన బెల్టును కాజేయాలని యత్నించాడట. టిప్పు వాణ్ణి తన కత్తితో కొట్టాడు. అప్పుడా ఇంగ్లీషు సైనికుడు టిప్పు తలకు గురిపెట్టి తుపాకి పేల్చాడు. టిప్పు వెంటనే మరణించాడు. [టిప్పు మరణించిన కోటద్వారం బొమ్మలో చూడండి.]

టిప్పు మరణంతో ఒక గొప్ప రాజ్యం అంతరించింది; ఇంగ్లీషువారికి ప్రబల శత్రువొకడు పోయాడు. గెలిచిన ఇంగ్లీషువారు శ్రీరంగపట్టణాన్ని కొల్లగొట్టేశారు.

మైసూరు ఇంగ్లీషువారి వశమయింది. టిప్పు కుటుంబంవారిని వెల్లూరునగరంలో

నిర్బంధించారు. వెలస్లీ రాజకీయవిజ్ఞతగా భావించి మహారాష్ట్రులకు మైసూరు వాయువ్యదిశన ఉన్న రెండు మండలాలు ఇస్తానన్నాడు, కాని మహారాష్ట్రులు వాటిని నిరాకరించారు. కాని ఇంగ్లీషువారు నిజాముకు మైసూరు ఈశాన్య ప్రాంతం నుంచి గుత్తి, గుర్రంకొండ ప్రాంతాలను ఇస్తే నిజాము స్వీకరించాడు. మైసూరు పశ్చిమ ప్రాంతంలోని కెనరానూ, వైనాడూ, కోయంబత్తూరూ, ధారాపురమూ, శ్రీరంగపట్టణమూ మొదలైన వాటిని ఇంగ్లీషువారు సొంతం చేసుకున్నారు.

ఇలా పంపకం అయిపోగా మిగిలిన మైసూరు రాజ్యానికి ఒక బాలుణ్ణి రాజుగా ఏర్పాటు చేశారు. ఆ బాలుడు మైసూరును పాలించిన హిందూ రాజుల సంతతివాడు. అయితే అతను నామమాత్రపు రాజు. మైసూరు పై సర్వాధికారాలూ ఇంగ్లీషు వారి చేతిలోనే వున్నాయి. మైసూరు రాజు వారికి కప్పం కట్టాలి, ఇంగ్లీషు సేనలను భరించాలి.

మైసూరును ఈ విధంగా విభజించటం వల్ల ఇంగ్లీషువారికి భూలాభమూ, ఆర్థిక లాభమూ, వాణిజ్య లాభమూ, సైనిక లాభమూ కూడా లభించాయి. అందుచేత వెలస్లీ చేసిన ఈ ఏర్పాటును ఇంగ్లండులో ఘనంగా మెచ్చుకుని, అతనికి మార్క్వెస్ పదవి బహూకరించారు.

టిప్పు పతనంతో ఫ్రెంచివారికి ఈ దేశంలో మిత్రులెవరూ లేకుండాపోయారు. ఇంగ్లీషు వారికి ఈ దేశం సంబంధించి సంతవరకు వారి బెడద తీరిపోయింది.

టిప్పు అసాధారణ వ్యక్తి. తన వర్గం వారిలో ఉండే అవినీతి అతనిలో లేదు. అతని రాజకీయ పరిజ్ఞానం సునిశితమైనది. తనకు నిజమైన శత్రువులు ఇంగ్లీషువారే గాని స్వదేశీయులు కారని అతను స్పష్టంగా గ్రహించాడు.





# కోళ్ళదొంగ

ఒక గ్రామంలో కన్నయ్య అనే కాపు ఉండే వాడు. అతను బొత్తిగా అమాయకుడు, ఎవ రేది చెప్పినా నమ్మి, మోసపోయేవాడు. కాని అతని భార్య కన్నమ్మ కాస్త చురుకైన మనిషి. కుటుంబ భారం మొయ్యటం తన భర్తవల్లకాదని తెలుసుకుని, ఆమె తన కున్న నగలు అమ్మి యాభై కోళ్ళను కొని, వాటి గుడ్లు ఊళ్ళోవాళ్ళకు అమ్మి సంసారం జరుపుతూ వచ్చింది.

కన్నయ్య పొరుగున చలమయ్య అనే ధనికుడుండేవాడు. అతను పరమ లోభి. తన డబ్బంతా ఇనపపెట్టెలో పెట్టి పూజిస్తూ ఉండేవాడు. అతనికి కోడికూరంటే చాలా ఇష్టం. కాని డబ్బుపెట్టి కోడిని కొనాలంటే ప్రాణం చివుక్కుమనేది. కన్నయ్య అవర ణలో కోళ్ళను రోజూ చూస్తూంటేనూ ప్రాణం పీకేది. అందుచేత చలమయ్య రాత్రివేళల అప్పుడప్పుడూ కన్నయ్య ఇంటి గోడ దూకి కోళ్ళను కాజెయ్యటం ప్రారంభించాడు.

కొన్ని రోజుల అనంతరం కన్నమ్మ తన కోళ్ళు తరిగిపోతూండటం గమనించింది. దొంగను పట్టాలని ఆమె ప్రతి రాత్రీ కోళ్ళకు కాపలా ఏర్పాటు చేసింది. ఒక రోజు కన్నమ్మ కాపలా ఉంటే మరో రోజు కన్నయ్య కాపలా ఉంటూ వచ్చాడు. కన్నమ్మ రాత్రల్లా మేలుకుని ఉండేది, కాని కన్నయ్య గురకపెట్టి నిద్రపోయేవాడు. ఈ సంగతి కనిపెట్టి చలమయ్య, కన్నయ్య కాపలా ఉన్న రాత్రులే కోళ్ళను దొంగి లించేవాడు.

"నిద్రమొహం వాడివి, నువు కాపలా ఉన్నా ఒకటే, లేకపోయినా ఒకటే. ఇట్లా అయితే మనం అడుక్కు తినాలిసిందే," అని కన్నమ్మ తన భర్తను గట్టిగా చివాట్లు వేసింది.

ఎస్. నిర్మల



కన్నయ్యకు పౌరుషం వచ్చి, తన వంతు వచ్చిన రాత్రి, నెత్తిన గొంగళి కప్పుకుని చీకట్లో కూర్చుని కాపలా కాయసాగాడు. అర్ధరాత్రివేళ కోళ్ళగూళ్ళ దగ్గిర అలికిడి అయింది. ఎవరో ముసుగు వేసుకుని అక్కడ తచ్చాడుతూండటం చూసి, కన్నయ్య ఆ మనిషి మీద పడి పట్టుకున్నాడు.

అయితే చలమయ్య కన్నయ్య కన్న బలమైనవాడు కావటంచేత పట్టు తప్పించుకుని, పెరటి గోడ దూకి, పారిపోయాడు. కాని ఈ పెనుగులాటలో చలమయ్య బొడ్లో అస్తమానమూ ఉండే తాళపుచెవులగుత్తి కింద పడిపోయింది.

దొడ్లో అయిన అలికిడికి కన్నమ్మ లేచి, దీపం తీసుకుని ఇంట్లో నుంచి, కోళ్ళగూళ్ళ దగ్గిరకు వచ్చి, ''దొంగ గాని వచ్చాడా ఏం?'' అని అడిగింది.

చిక్కిన దొంగను జారిపోనిచ్చిన కన్నయ్య వెర్రిమొహం వేశాడు. తన భర్త చాతగాని తనానికి విసుక్కుంటున్న కన్నమ్మకు, దీపం వెలుతురులో తాళం చెవులగుత్తి కనపడింది.

"దొంగ దొరికాడులే! ఈ తాళపుచెవుల కోసమైనా మళ్ళా రాకపోడు. అప్పుడైనా పట్టుకో!" అని కన్నమ్మ ఆ తాళపుచెవుల గుత్తి తీసుకుని లోపలికి వెళ్ళిపోయింది.

చలమయ్య తన కొక పెద్ద అపద తప్పినందుకు సంతోషించాడు. ఎందుకంటే, దొంగగా పట్టుబడి ఉంటే ఇక ఆ వూళ్ళో తనకు బతికే యోగ్యత ఉండేదికాదు. అతను అలవాటుప్రకారం తాళపుచెవుల కోసం తడువుకుని, అవి కన్నయ్య ఆవరణలో పడిపోయినట్టు గ్రహించాడు. కన్నయ్యను అమాయకుణ్ణిచేసి, తన తాళపు చెవుల గుత్తి తిరిగి సంపాదించాలని అతను ఆలోచన చేశాడు.

చలమయ్య మర్నాడు కన్నయ్య ఇంటికి వెళ్ళి, "కన్నయ్యా, నీకు తొందరపని



లేకపోతే కాస్త పొలంవైపు వెళ్ళొద్దాం, రారాదూ?" అన్నాడు. కన్నయ్య సరేనని బయలుదేరాడు.

దారిలో చలమయ్య కన్నయ్యతో, "కన్నయ్యా, ఈ మధ్య నీ కోళ్ళ నెవరో దొంగిలిస్తున్నా రంటివే, దొంగ చిక్కాడా?" అని అడిగాడు.

కన్నయ్యకు ఎక్కడలేని హుషారూ వచ్చి, "అవును, చలమయ్యా. రాత్రి పట్టుకున్నాను. కాని, వాడి అదృష్టం బాగుంది. తప్పించుకుపోయాడు. లేకపోతే సున్నం లోకి ఎముకమిగిల్చేవాణ్ణా? అయినా వాడి తాళాలగుత్తి నా చేత చిక్కిందిలే. వాటి కోసం రాడూ? అప్పుడు దొరకపుచ్చుకుని చెబుతా వాడిపని!" అన్నాడు.




చలమయ్య ఏదో ఆలోచన వచ్చినట్టు నటించి, "చూడు, కన్నయ్యా. ఇన్నాళ్ళూ నీ కోళ్ళు దొంగిలించింది మనిషికాదయ్యా, కోళ్ళ పిశాచం. దానికి కోళ్ళంటే మహా ఇష్టంట, మా తాతయ్య చెప్పేవాడు. దానికి శ్మశానంలో ఇనప్పెట్టె ఉంటుందిట. ఆ ఇనప్పెట్టె తాళంచెవులనది అస్తమానమూ బొడ్లో పెట్టుకు తిరుగుతుందిట. ఇంకేం? నీ పంట పండింది! అర్ధరాత్రి, నీ భార్యకు తెలియకుండా ఆ తాళపుచెవులు తీసుకుని శ్మశానానికిరా. నేను కూడా వచ్చి దాని ఇనప్పెట్టె చూపిస్తాను. ఒకటి మాత్రం జాగ్రత్త. ఆ పిశాచం శ్మశానంలోనే ఉండొచ్చు. ఈ రహస్యం నీ పెళ్ళానికి మాత్రం చచ్చినా చెప్పకు," అన్నాడు.

పాపం, కన్నయ్య ఇదంతా నిజమని పూర్తిగా నమ్మాడు.

ఆ రాత్రి కోళ్ళు కాయటం కన్నమ్మ వంతు గనక ఆమె పెరట్లో పడుకుంది. రాత్రి బాగా పొద్దుపోయాక కన్నయ్య లేచి, కన్నమ్మ పెట్టెలో నుంచి తాళంచెవుల గుత్తి తీసుకుని, ఊరికి మైలు దూరంలోవున్న శ్మశానానికి వెళ్ళాడు.

అక్కడ ఒక సమాధి పక్కన కన్నయ్యకొక ఆకారం కనిపించింది. అది చలమయ్యే అనుకుని కన్నయ్య చిన్న గొంతుతో, "చలమయ్యా, యిటురా. ఇవిగో, తాళపుచెవులు తెచ్చాను," అంటూ తాళపుచెవులగుత్తి తన చేతిలో పట్టుకుని చూపాడు.

నిజానికి ఆ ఆకారం చలమయ్యే. కాని అతను మాటా పలుకూ లేకుండా కన్నయ్య చేతిలోని తాళపుచెవులగుత్తి లాక్కోబోయాడు. అది కొళ్ళ పిశాచమనీ, తాళపుచెవులు లాగేసుకో జూస్తున్నదనీ అనుకుని కన్నయ్య తన శక్తికొద్దీ పోరాడాడు.

చివరకు చలమయ్య తన తాళపుచెవుల గుత్తి కన్నయ్య చేతి నుంచి ఎలాగో లాగేసుకున్నాడు, కాని ఆ పెనుగులాటలో చలమయ్య వేలి ఉంగరం కన్నయ్య చేతిలోకి ఊడి వచ్చేసింది. ఇది గమనించకుండానే చలమయ్య పారిపోయి చీకట్లో అదృశ్యమయాడు. తాళంచెవులగుత్తి పోయినా బంగారం ఉంగరం దొరికినందుకు తృప్తిపడి కన్నయ్య ఇంటికి చేరుకున్నాడు.

తెల్లవారగానే కన్నయ్య తన భార్యతో క్రితం రోజు చలమయ్య తనతో అన్న మాటలూ, రాత్రి శ్మశానంలో పిశాచంతో పెనగులాటా వివరించి చెప్పి, తనకు దొరికిన ఉంగరం ఆమెకు చూపాడు.

అది చలమయ్య ఉంగరమని చూడగానే కన్నమ్మ కనిపెట్టింది. అదీగాక దాని మీద చలమయ్య పేరు కూడా ఉన్నది.

దొంగ దొరికిపోయాడు. కన్నమ్మ గ్రామాధికారి వద్దకు వెళ్ళి, ఉంగరం చూపి, జరిగినదంతా చెప్పింది. గ్రామాధికారి చలమయ్యను పిలిపించి, అతని చేత నేరం ఒప్పించి, కన్నమ్మకు నష్టపరిహారం ఇప్పించాడు. ఆ తరవాత చలమయ్య ఆ గ్రామంలో ఉండలేక ఎటో వెళ్ళిపోయాడు. ఆ పైన కన్నమ్మ ఇంట కొళ్ళ దొంగతనాలు మరి జరగలేదు.





# శిధిలాలయం

## 7

[శిఖిముఖీ, విక్రమకేసరీ తిమ్మగూడెం వెళ్ళారని కబురందగానే, శివాలుడు కొందరు అనుచరులతో ఆ గూడేనికి వెళ్ళాడు. అతడు చేరేనరికి శిఖిముఖి, నవరగండుపోతును ఈటెతో పొడిచి వడ్లపాతర్లో పడవేశాడు. గండుపోతు అనుచరులు, శిఖిముఖి మీదికి వచ్చేంతలో శివాలుడు వాళ్ళను ఆయుధాలు కిందపడవేయమని హెచ్చరించాడు. తరవాత—]

సవరగండుపోతు గాయపడి వడ్లపాతర్లో పడిపోగానే, అతడి అనుచరులకు నాయకత్వం వహించిన సవరుడు, శివాలుడి హెచ్చరిక విని తాను పెద్ద చిక్కులో తల దూర్చానని గ్రహించాడు. ఇప్పటి పరిస్థితుల్లో పోరుకు దిగటం అంటే సర్వనాశం కావటమే; అలా అని శివాలుడికి లొంగిపోతే—యిక సవరపల్లెల్లో తనకూ, తమ నాయకుడికీ మానమర్యాదలు దక్కవు....

సవరుడు యిలా ఆలోచించి, శివాలుడి కేసి తిరిగి పెద్ద గొంతుతో, "మీరు మమ్మల్ని అన్ని వైపుల నుంచీ చుట్టుముట్టారు. మా కన్న మీరు రెండు మూడింతలు అధిక సంఖ్యలో వున్నారు. ఇది న్యాయం కాదు. మీరు చేసేది ధర్మయుద్ధం అనిపించుకోదు," అన్నాడు.

ఆ మాటలు వింటూనే శిఖిముఖి సవరుడి కేసి తీవ్రంగా చూసి, "ప్రతిదానికి



న్యాయం, ధర్మం అంటూ వెకిలిగా మాట్లాడటం, మీరు ఆ శిథిలాలయ పూజారి దగ్గిర్నుంచి నేర్చుకున్నట్టుంది. డబ్బు కాశపడి, పరాయి చోటు నుంచి వచ్చిన మంత్రాల పోతు పూజారికి సహాయపడటం న్యాయం, ధర్మం అవుతుందా? ఈ తిమ్మగూడెం మీద వచ్చిపడి ధాన్యం దోచుకుంటున్నారే, యిదేరకం ధర్మం? ఇక అట్టే మాట్లాడక ఆయుధాలు కింద పడెయ్యండి," అన్నాడు.

"ఒకసారి మేం నిరాయుధులం అయింతరవాత, మమ్మల్నందర్నీ మీరు ఈటెల్తో పొడిచి చంపరని హామీ ఏవిఁటి?" అన్నాడు సవరుడు.



"అదంతా మా దయాదాక్షిణ్యాల మీద అధారపడి వుంటుంది. ఇంతకూ మీరు చెప్పిన ఆయుధాలు అవతల పారేస్తారా? లేక...." అంటూ శిఖిముఖి, విక్రమకేసరి వెంట వున్న శబరయోధులకేసి చూశాడు.

శిఖిముఖి మాటల ధోరణిని అలాగే సాగనిస్తే, అనవసర రక్తపాతం జరుగుతుందని భయపడి, శివాలుడు తన చేతిలో వున్న యీటెను దూరంగా విసిరివేస్తూ, "మీ సవరల్లో ఏ ఒక్కరికీ హాని జరగదని నేను మాట యిస్తున్నాను. కావాలంటే ఆయుధాలు దగ్గిరే వుంచుకోండి, నా అభ్యంతరం లేదు. నా క్కావలసిన వాడు శిథిలాలయ పూజారి. వాడే నాకు ప్రబల విరోధి. ఇంతకూ మీ నాయకుడు గండుపోతెక్కడ?" అని అడిగాడు, సవరల నాయకుడుగా మాట్లాడిన వాణ్ణి.

"ఇక్కడ! ఇక్కడ! వడ్లపాతర అడుగున పడున్నాను. గాయం నుంచి నెత్తురు వరదలై పారుతున్నది. కళ్ళు బైర్లు తిరుగుతున్నై," అంటూ అరిచాడు సవరగండు పోతు పాతర్లో నుంచి.

శివాలుడు ఆశ్చర్యంగా ఆ మాటలు వినిపించిన వైపుకు చూసి, గబగబా వడ్ల పాతర దగ్గిరకు పోయి, లోపలికి తొంగి



చూశాడు. గండుపోతు పాతర మధ్య కూర్చుని తలఎత్తి శివాలుడి కేసి చూశాడు.

"గండుపోతూ! ఏమిటిది? గాయ పడ్డావా? త్వరగా పైకెక్కిరా. ఆ శిథిలాలయ పూజారిని పట్టుకునేందుకు నీ సహాయం కావాలి," అన్నాడు శివాలుడు.

"పైకెక్క రాగలిగితే, ఎప్పుడో వచ్చి వుండేవాణ్ణి. ఈటె పోటు తిని కుడిచేయి చచ్చుపడి పోయింది. ఎడమకాలి కీళ్ళిరిగినట్టు అనుమానం. ఇంత చేసిన వాడెవడో తెలుసా? నీ కొడుకు శిఖిముఖి! వాడు ధైర్యసాహసాల్లో, కత్తి, యీటే సాముల్లో నా అంతటివాడు. వాడికి యీడొచ్చిన నా కూతురు నాగుమల్లిని ఎందుకు చేసుకోగూడదు? ఏమంటావ్, శివాలూ?" అన్నాడు గండుపోతు పకపకనవ్వుతూ.

ఈ అసందర్భపు మాటలు వినగానే, ఎత్తు నుంచి పడటంవల్లా, గాయం నుంచి రక్తస్రావం జరగటంవల్లా గండుపోతుకు మతిచలించి వుంటుందనుకున్నాడు, శివాలుడు. ఆ వెంటనే అతడు తన అనుచరుల్ని హెచ్చరించి ఒక కొయ్యపలక తెప్పించి, దాని చివర్లకు తాళ్ళు కట్టించి, ఇద్దర్ని పాతర్లోకి దింపాడు. వాళ్ళిద్దరూ గండుపోతును కూర్చున్న చోటు నుంచి ఎత్తి కొయ్యపలక మీద పడుకోబెట్టారు. పాతర పైనున్న వాళ్ళు, గండుపోతును మాటులోపడ్డ అడవి జంతువును పైకి లాగినట్టు తాళ్ళ సాయంతో పైకి లాగారు.

గండుపోతు తన అనుచరుల కేసి చూసి ఆశ్చర్యపడుతూ, "మన వాళ్ళందరి దగ్గిరా ఆయుధాలున్నయ్యే! ఇంతకీ యిక్కడ గెలిచిందెవరు? మన వాళ్ళెందరు చచ్చారు?" అని ప్రశ్నించాడు.

సవరలకు నాయకత్వం వహించిన వాడు గండుపోతు ముందుకు వచ్చి, "దొరా! శబర శివాలుదొర యిక్కడ రక్తపాతం జరక్కుండా ఆపారు," అన్నాడు.



అనుచరు డలా చెప్పగానే గండుపోతు, శివాలుడి కేసి తిరిగి, "నేను మీ జాతివాళ్ళకు చాలా అన్యాయం చేశాను. పూజారికుక్క నాకు బంగారం ఆశ చూపి, నా చేత పాడు పనులు చేయించాడు. నన్ను క్షమించు," అన్నాడు వణుకుతున్న గొంతుతో.

"జరిగిందేదో జరిగింది; యిద్దరం మరిచిపోదాం. ముందు నీ కాలికీ, చేతికీ కట్లుకట్టనీ. తరవాత ఆ పూజారి వేట అందరం కలిసి ప్రారంభిద్దాం," అని చెప్పి, శివాలుడు అంత దూరాన నిలబడి చూస్తున్న వృద్ధుడొకణ్ణి దగ్గిరకు పిలిచి, "ఈ సవరజాతి పెద్దకు వెంటనే చికిత్సచెయ్యి," అన్నాడు.

ఆ వృద్ధుడు గ్రామవైద్యుడు. అతను తన వైద్యపరికరా లెప్పుడూ సంచీలో పెట్టుకుని భుజానికి వేలాడవేసుకుని తిరుగుతూంటాడు. అతడు గండుపోతు చేతిగాయం మీద ఏదో ఆకుపసరు పిండి, అవే ఆకుల్ని కట్టుగా కట్టాడు. తరవాత గండుపోతు ఎడమకాలిని వేళ్ళతో పట్టి చూసి, యిద్దరు సవరుల్ని గండుపోతు చేతులు పక్కలకు లాగి పట్టుకోమని చెప్పి, రెండు వెదురు బద్దల్ని అతడి మోకాలుకు పైనా కిందా పెట్టి, తాడుతో గట్టిగా బిగించి ముడివేశాడు. వైద్యుడిది చేసేప్పుడు గండుపోతు బాధతో




గిలగిల్లాడిపోతూ, "ఇంత బాధకూ కారకుడు ఆ పూజారికుక్క! వాడిచ్చిన బంగారు ఇటుకల్ని మహానదిలో పారెయ్యండి. వాణ్ణి ఈడ్చుకొచ్చి, టేకుమాను చివారుకొమ్మన ఎండగట్టండి!" అంటూ అరిచాడు.

కట్లు కట్టడం అయిపోగానే గ్రామవైద్యుడు లేచి నిలబడి, గండుపోతు ముఖంలోకి తీక్షణంగా చూస్తూ, "గండుపోతూ, వైద్యుడుగా నా ధర్మమేదో నేను చేశాను. ఇప్పుడు చెప్పు; మా గ్రామం నుంచి దోచుకుపోయిన ధాన్యం మాకు తిరిగి యివ్వదలిచావా, లేదా?" అని ప్రశ్నించాడు.






"మా వాళ్ళు ఎత్తుకుపోయింది బహు కొద్ది ధాన్యమే. అంతా ఎత్తుకుపోకుండా శిఖిముఖి పులిగండులా వచ్చి పడ్డాడు. మా వాళ్ళు ఎత్తుకుపోయిన ప్రతి బస్తా ధాన్యానికీ రెండు బస్తాల మా సొంత ధాన్యం చేర్చి, మీ గ్రామ పాతర్లో పోయిస్తాను," అని చెప్పి, గండుపోతు తన అనుచరులతో, "బస్తాలుగా కట్టివున్న ధాన్యమంతా పాతర్లో పోయండి. మనవాళ్ళు గూడెం దాటించిన ప్రతి బస్తాతోనూ, మరి రెండుబస్తాల ధాన్యం మన పల్లె నుంచి యిక్కడికి తీసుకురండి," అని చెప్పాడు. తమ నాయకుడు ఇలా ఆజ్ఞాపించగానే,



సవరులు కొందరు తమ పల్లె కేసి బయలు దేరబోయారు. గండుపోతు వాళ్ళను ఆపి, "పూజారికుక్క, తన గుహ వదిలి అరణ్యంలో తిరుగుతూండొచ్చు. ఒకవేళ మీ కెదురుపడి అడిగితే, ఇక్కడ మన సవరు లందరూ, శబరశివాలుడికి ఖైదీలుగా చిక్కిపోయారని చెప్పండి," అన్నాడు.

తరవాత గండుపోతును, శివాలుడు యిద్దరి చేత గ్రామచావడిలోకి మోయించుకు పోయాడు.

గ్రామచావడిలో శివాలుడూ, శిఖిముఖీ, విక్రమకేసరీ ఒక పక్కగా కూర్చున్నారు. గండుపోతు తన అనుచరులు పరిచిన జంతుచర్మాల మీద గోడకు చేరగిలబడి కూర్చున్నాడు. శివాలుడు ప్రశ్నించిన మీదట అతడు, శిథిలాలయ పూజారి వారం రోజుల క్రితం తమ పల్లెకు రావటం, లంచంగా చాలా బంగారం యిచ్చి, విక్రమకేసరి నుంచి తాళపత్ర గ్రంథం సంపాయించి తన కివ్వమని అడగటం గురించి చెప్పాడు.

"శివాలూ, కేవలం వాడిచ్చిన వెధవ బంగారం కోసమే, నేనిన్ని పాడుపనులు చేశాననుకోకు. వాడు నాకు మహత్తరమైన మంత్రాలు నేర్పి, నన్ను ఈ అరణ్య రాజ్యానికి మహారాజును చేస్తానన్నాడు.





వాడింతకీ కావాలనే ఆ తాళపత్ర గ్రంథం రహస్యం ఏమిటి?" అని ప్రశ్నించాడు, గండుపోతు.

"అది నువ్వడగవలసిన ప్రశ్న కాదు, గండుపోతూ. ఒక విధంగా నాకూ ఆ తాళ పత్రాల్లో వున్న రహస్య విషయా లేమిటో పూర్తిగా తెలియవు. అదలా వుంచుదాం. ఈ శిథిలాలయ పూజారి, ఈ ప్రాంతాల నుంచి స్వేచ్ఛగా తిరిగి బ్రహ్మపుత్రానదీ లోయలకు పోవటం, ముందు ముందు కొన్ని చిక్కులకు దారితీస్తుంది. వాణ్ణిక్కడే పట్టుకుని హతమార్చాలి. ప్రస్తుతం వాడు దాగివున్న కొండగుహ ఎక్కడ?" అని అడిగాడు శివాలుడు.

గండుపోతు, శిఖిముఖి కేసి తలతిప్పి, "మీ శిఖికి యీ చుట్టుపక్కల వున్న అరణ్యం, కొండలూ క్షుణ్ణంగా తెలిసినవే కదా. శిఖీ! నందికొండ దిగువున వున్న తాటితోపు నీ వెరిగే వుంటావు. ఆ తోపుకు దక్షిణపు అంచున ఒక అయిదుతలల తాటిచెట్టున్నది. ఆ తాటిచెట్టెక్కి అన్నిటి కన్న ఎత్తుగావున్న తల మీంచి చూస్తే, ఆ పూజారిగాడు వుంటున్న గుహ సూటిగా కనబడుతుంది. ఆ గుహ పక్కన మరి కొన్ని గుహలున్నవి గనక, ఆ దుర్మార్గు



డున్న గుహను గుర్తించటానికి యిదొక్కటే మార్గం," అన్నాడు.

"ఆ గుహ ముందు కావలి వాళ్ళెవరైనా వున్నారా?" అన్నాడు శిఖిముఖి.

"గుహ ముందు లేరు, తాటితోపులో మా వాళ్ళు యిద్దరు ముగ్గురున్నారు. నీకు సహాయం చేయమని వాళ్ళకు యిప్పుడే కబురు పంపుతాను," అన్నాడు గండుపోతు.

శివాలుడి అనుమతి పొంది, శిఖిముఖీ, విక్రమకేసరీ నలుగురు అనుచరులను వెంట బెట్టుకుని నందికొండ కేసి బయలు దేరారు. అవసరం రావచ్చున్న నమ్మకంతో శిఖిముఖి విల్లంబులు వెంట పెట్టుకు

పోయాడు. వాళ్ళు నందికొండను చేరేసరికి సూర్యుడు బాగా పడమటికి వాలాడు. తాటి తోపులో వున్న గండుపోతు అనుచరులు తమ నాయకుడి నుంచి ముందే వార్త అంది వుండటంతో, శిఖిముఖినీ, విక్రమ కేసరినీ అయిదుతలల తాటి చెట్టున్న చోటుకు తీసుకుపోయి, "మీరు తాటి చెట్టెక్కి చూడండి. పూజారి గుహలోనే వున్నాడు. రెండు మూడు గంటల సేపు నుంచీ ఎందుకనో గుహంతా కలయ తిరుగు తున్నాడు. గుహలో అంతగా వెలుగు లేక పోవటంతో, వాడేం చేస్తున్నదీ స్పష్టంగా తెలియటం లేదు," అని చెప్పారు.

శిఖిముఖి, విక్రమకేసరి సంప్రతించు కున్నారు. విక్రమకేసరి కొందరు అనుచరు లతో గుహ దగ్గిరకు పోయేట్టూ, ఒకవేళ పూజారి వాళ్ళు రావటం చూసి పారి పోయేందుకు ప్రయత్నిస్తే, శిఖిముఖి చెట్టు మీది నుంచి బాణం వదిలి వాణ్ణి చంప టమో, గాయపరచటమో చేసేట్టూ నిర్ణ యించుకున్నారు.

పావుగంట తరవాత విక్రమకేసరి కొండ ఎక్కి గుహను సమీపించేంతలో, అప్పటి వరకూ గుహలో నీడలా అటూ యిటూ తిరుగుతున్న పూజారి ఆకారం, ఒక్కసారిగా ఎగిరి గంతేసినట్టు, చెట్టు మీదున్న శిఖి ముఖికి తోచింది. పూజారి పారిపోయే ప్రయత్నం చేస్తున్నాడని భావించి, శిఖి ముఖి గురి చూసి బాణం వదిలాడు. బాణం దెబ్బ తగలగానే, గుహలో వున్న ఆకారం బాధతో ఎలుగుబంటిలా ఒక్కసారి గాండ్రించింది.

ఆ గాండ్రింపు వింటూనే విక్రమకేసరీ, అతడి వెంట వున్నవాళ్ళూ, గుహ కేసి వేగంగా పరిగెత్తారు. "పూజారి ఎలు గ్గొడ్డుగా మారాడు!" అనుకుంటూ శిఖి ముఖి చెట్టు మీంచి దిగి, గుహ కేసి పరుగుతీయ సాగాడు. —(ఇంకా వుంది)





# వీరగంగుడు

విసుగుచెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నువు నిజంగా గొప్ప సత్త్వవంతుడవేగాని, వీరగంగు సత్త్వంలాగా నీది కూడా నిరుపయోగమై పోవచ్చునని సంశయంగా ఉన్నది. శ్రమ తెలియకుండా నీకు వీరగంగు కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

మణిపురాన్ని ఏలే శూరసేన మహారాజు ఏటా విజయదశమికి వేడుకలు జరిపేవాడు. అందులో కత్తిసామూ, మల్లయుద్ధమూ, విలువిద్యా మొదలైన ప్రదర్శనలుండేవి. ఈ ప్రదర్శనలలో పాల్గొనటానికి అనేక దేశాలవాళ్ళు వచ్చేవాళ్ళు. అష్టమినాడు జరిగిన ప్రదర్శనలలో నెగ్గిన వారిని రాజు దశమినాటి దాకా తన అతిథులుగా ఉంచు

## బేతాళ కథలు





కుని, నృత్యగాన వినోదాలతోనూ, విందుల తోనూ, బహుమతులతోనూ సంతోషపెట్టి పంపేవాడు. సాధారణంగా అష్టమినాటి ప్రదర్శనలలో నెగ్గేవారంతా దేశాంతరాల నుంచి వచ్చినవారే అయిఉండేవారు.

ఒక ఏడు ప్రదర్శనలు జరిగినప్పుడు కత్తిసాములో గొప్ప నేర్పరి ఒకడు వచ్చాడు. అతను వరసగా అయిదుగురి చేతులలో నుంచి కత్తులు సునాయాసంగా ఎగరగొట్టేసి, "ఇంకెవరైనా ఉన్నారా?" అని చుట్టూ కలయజూశాడు.

అప్పటివరకూ ప్రేక్షకుల మధ్య ఉండి వినోదం చూస్తున్న ఒక అందమైన యువకుడు కత్తిదూసి ముందుకు వచ్చాడు. ఇద్దరి కత్తులూ కలిశాయోలేదో ప్రేక్షకులు గమనించేలోపునే నిపుణుడి కత్తి కాస్తా అతని చేతి నుంచి ఎగిరిపోయింది.

రాజుగారు ఆ యువకుణ్ణి పిలిపించి, "నీ పేరేమిటి?" అని అడిగాడు.

"మహారాజా, నన్ను గంగు అని పిలుస్తారు. వీరగంగు అని పిలిచేవాళ్ళుకూడా ఉన్నారు," అన్నాడు యువకుడు.

"నీది ఏదేశం?" అని రాజు మళ్ళీ అడిగాడు.

"నేను ఈదేశంవాణ్ణే," అన్నాడు గంగు.

రాజుకు పరమానందమయింది. ఇంత కాలానికి తన దేశంపేరు నిలబెట్ట గలిగినవాడొకడు కనిపించాడు.

మిగిలిన పోటీలలో నెగ్గినవారితోబాటు గంగు కూడా రాజకుటుంబానికి అతిథిగా మూడు రోజులపాటు ఉండి పోయాడు. ఆ సమయంలోనే అతను రాజకుమార్తెను చూడటమూ, ఆమెతో కొద్దిసేపు మాట్లాడటమూ తటస్థించింది.

గంగును చూసిన క్షణంలోనే రాజకుమార్తె అతన్ని ప్రేమించింది. అతను కూడా తనను ప్రేమించినపక్షంలో, తండ్రిని ఒప్పించి ఎలాగైనా అతన్నే పెళ్ళి చేసుకోవా





లనుకున్నది. అందుచేత ఒక మాటకారి అయిన చెలికత్తె ద్వారా అతని అభిప్రాయం తెలుసుకోవటానికి ప్రయత్నించింది. ఆ చెలికత్తె తిరిగి వచ్చి, "గంగు నీకన్నా కూడా హెచ్చుగా నిన్ను ప్రేమిస్తున్నాడు. అతని స్థితి చాలా విచారకరంగా ఉన్నది," అని చెప్పింది. ఈ మాట విని రాజకుమార్తె చాలా సంతోషించింది.

విజయదశమినాడు దివాణానికి సంబంధించిన పనివాళ్ళందరూ కానుకలు పుచ్చుకోవటానికి వచ్చారు. వారిలో ఒక చాకలిది రాజకుమార్తె నుంచి కానుకలు పుచ్చుకుంటూ, "అమ్మా, దొంగల నాయకుడి కొడుకు గంగన్న ఇక్కడెందుకున్నాడమ్మా?" అని రహస్యంగా అడిగింది.

రాజకుమార్తె నిర్ఘాంతపోయి, "దొంగల నాయకుడి కొడుకెవరే?" అన్నది.

"ఆ అబ్బాయి గంగన్నేనమ్మా. ఊరి బయట పాడుబడిన కోటలో ఉంటారు. వాళ్ళకూ మేమే బట్టలుతికేది!" అన్నది చాకలిది.

రాజకుమార్తె హతాశురాలైపోయింది.

"ఈ మాట ఇంకెక్కడా అనకు. రేపు అతని దారిన అతను పోతాడు," అని రాజకుమార్తె చాకలిదాన్ని వేడుకున్నది.



మర్నాడు గంగు తనకు రాజుగారిచ్చిన బహుమానాన్ని తీసుకుని తన యింటికి తిరిగి వెళ్ళిపోయాడు. అతను రాజకుమార్తె కోసం తపించిపోతున్నాడు, కాని ఆమెను మళ్ళీ చూసే అవకాశం అతనికి దొరకలేదు.

రాజకుమార్తె కూడా గంగు కోసం లోలోపల కుమిలిపోయిందే గాని, అతన్ని పెళ్ళాడే ప్రయత్నం చెయ్యలేదు. తరవాత కొద్ది కాలానికి రాజుగారు తన వివాహానికి ప్రయత్నాలు ప్రారంభిస్తే ఆమె అభ్యంతరం కూడా చెప్పలేదు. ఆమెను పొరుగు దేశపు యువరాజు కిచ్చి పెళ్ళిచెయ్య నిశ్చయించి, ముహూర్తం కూడా పెట్టుకున్నారు.





కాలక్రమాన రాజకుమార్తె పెళ్ళి సలక్షణంగా జరిగిపోయింది. ఆమె భర్త ఆమెను వెంటబెట్టుకుని సపరివారంగా తన రాజ్యానికి బయలుదేరాడు.

గంగు ఈలోపల రాజకుమార్తె పెళ్ళి వివరాలన్నీ తెలుసుకుంటూనే ఉన్నాడు. ఆమెను తీసుకుపోతున్న రాజకుమారుణ్ణి అరణ్యప్రాంతంలో అటకాయించాడు.

"నువు నిజంగా వీరుడివైతే నాతో కత్తి యుద్ధానికిరా. నన్ను చంపి రాజకుమార్తెను తీసుకుపో. ఎందుకంటే నా బొందిలో ప్రాణం ఉండగా ఆమెను మరొకడి భార్య కానివ్వను. నిన్ను చంపి నే నామెను నా భార్యగా చేసుకోవటానికి వచ్చాను," అన్నాడు గంగు రాజకుమారుడితో.

రాజకుమారుడు, సైనికులతో, "చూస్తారేం? ఈ హీనుణ్ణి చంపిపారెయ్యండి," అన్నాడు.

వెంటనే, అతని పరివారంలో ఉండే ఇరవైమంది భటులు కత్తులు దూసి గంగు పైకి వెళ్ళారు. కాని అంతమంది ఉండి కూడా గంగును ఎదిరించి కత్తి యుద్ధం చెయ్యలేకపోయారు.

ఇది చూసి రాజకుమార్తెభర్త, రథం దిగి, వెనకపాటున వెళ్ళి గంగు వీపులో కత్తితో పొడిచాడు. గంగు పడిపోయాడు.

ఇదంతా చూస్తున్న రాజకుమార్తె తాను కూడా రథం దిగి వచ్చి, పడిపోయిన గంగు దగ్గిర చతికిలబడి, అతని తలను తన ఒడిలో పెట్టుకుని, కంటికీ మంటికీ ఏకధారగా ఏడవసాగింది.

గంగు ఆమె కేసి ఆనందంతో చూసి, బలహీనంగా నవ్వి, "విచారించకు. నీకోసం చావటం కన్న ఆనందం లేదు," అని ప్రాణాలు విడిచాడు.

ఈ దృశ్యం కళ్ళారా చూసిన యువరాజు సహించలేక రాజకుమార్తెను కూడా వెన్నులో పొడిచాడు. ఆమె గంగు శవం మీద పడిపోయి, ప్రాణాలు వదిలింది.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నాకొక సందేహం. గంగు దుస్సాహసం చేసి తన ప్రాణంమీదికి తెచ్చుకున్నాడు. కాని రాజ కుమార్తె తన ప్రాణంమీదికి ఎందుకు తెచ్చుకున్నట్టు? గంగు రాజకుమార్తెను గాఢంగా ప్రేమించి, ఆ ప్రేమకు తన ప్రాణాన్ని బలిపెట్టాడనుకోవచ్చు. కాని రాజకుమార్తె అతన్ని అంతగా ప్రేమించ లేదు. తనకు తండ్రి మరొకణ్ణి తెచ్చి పెళ్ళి చేస్తే ఆమె అభ్యంతరం కూడా చెప్పలేదు. అలాటి మనిషి తన చావును కోరి తెచ్చు కున్నంతపని ఎందుకు చేసింది? ఈ సందే హానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తలపగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజకుమార్తె గంగును తక్కువ ప్రేమించిందని చెప్ప టానికి అవకాశంలేదు. గంగు రాజకుమా ర్తెను ప్రేమించటంలో త్యాగం ఏమీలేదు. కాని రాజకుమార్తె గంగును పెళ్ళాడాలంటే తన తండ్రివంశానికి తీరని కళంకం తీసుకు రాక తప్పదు. ఎందుకంటే అతని తండ్రి పేరుమోసిన గజదొంగ. అందుచేత రాజ కుమార్తె తన ప్రేమను త్యాగం చేసి తన తండ్రి నిశ్చయించిన వరుణ్ణి పెళ్ళాడింది. గంగు వీరుడే, కాని తన భర్త వీరుడు కాడని ఆమెకు తెలియదు. ఆ సంగతి అర ణ్యంలో గంగు అటకాయించినప్పుడు బయటపడింది. యువరాజు నిజంగా వీరుడై వుంటే ఒంటరిగాడైన గంగు పైకి అంత మందినిపంపడు. అతను నీచుడని కూడా నిరూపించుకుంటూ గంగును వెనుకపాటున పొడిచాడు. ఆ సంగతి తెలిసినాక రాజ కుమార్తెకు, అలాటి నీచుడికి భార్యగా జీవిం చటంకంటె గంగు ప్రియురాలుగా చావ టమే మేలనిపించి ఉండవచ్చు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# కూరగాయల తోట

లోగడ పాపన్న తన పరోపకార బుద్ధికొద్దీ గ్రామం వెలపల ఒక స్థలం కొన్నాడుగద. అక్కడ కూరలువేసి పండిస్తే బాగుంటుం దనీ, సంతలో కూరలకు మంచి గిరాకీ ఉన్న దనీ అన్నారు పాపన్న తల్లీ, భార్యాకూడా.

పాపన్నకు కూడా ఈ ఆలోచన నచ్చింది. డబ్బుచేసుకోవటం మాట ఎట్లా ఉన్నా, కూరల ధరలు జాస్తిగా ఉండటంచేత, వాటిని పండించి నలుగురికీ ఇస్తే ఉపకారంగా ఉంటుందని అతను అనుకున్నాడు.

అందుచేత పాపన్న ఆ స్థలంచుట్టూ కంచె వేయించి, పాత బావిని లోతు చేయించి, పాదులు తవ్వించి, అరటీ, వంగా, బెండా, గుమ్మడీ, బీరా, పొట్లా మొదలైనవి పెట్టించాడు. కొద్ది నెలలకల్లా కాపు ఆరంభమయింది. పాపన్న ఆ కూరలలో తన ఇంటి వాడకానికి అవసరమైనవి ఉంచుకుని, మిగిలినవి ఇరుగుపొరుగు వాళ్ళకూ, ఎరిగినవాళ్ళకూ, చెయ్యిచాచి అడిగినవాళ్ళకూ పంచిపెడుతూవచ్చాడు.

వాటిని అమ్మితే క్రమంగా స్థలం ఖరీదు రాబట్టుకునేపనే; కాని పాపన్నకు చెప్పి కూడా లాభం ఉండదని అతని తల్లీ, భార్యా మాట్లాడక ఊరుకున్నారు.

ఆ ఊళ్ళోనే రంగడు అనే బీదవాడొకడు ఉండేవాడు. వాడు రోజూ పాపన్న దగ్గిరికి వచ్చి యాచించి, కూరలు తీసుకుపోయేవాడు. వాడికి పాపన్న సంగతి తెలుసు. అందుచేత వాడు ఒకనాడు తోటకే వచ్చి "పాపన్నగారూ, మా ఇంటికి చాలామంది చుట్టాలు వచ్చారు. కొన్ని వారాలపాటు ఉంటారు. అందుచేత కూరలు కొంచెం జాస్తిగా ఇప్పించారంటె—" అంటూ ఒక గంప చూపించాడు.

"దానికేం? నీకు కావలసిన కూరలు కోసుకుపో," అన్నాడు పాపన్న.

కొంపల్లి బ్రహ్మానందరావు

రంగడు గంప నిండా కూరలు కోసుకుని, దాన్ని తిన్నగా సంతకు తీసుకుపోయి, రెండు రూపాయల ఖరీదుకు కూరలన్నిటినీ అమ్మేశాడు.

అదిమొదలు వాడు ప్రతిరోజూ తోటకు వచ్చి, గంపెడు కూరలు కోసుకుని, తీసుకు పోయి సంతలో అమ్మి, నిశ్చింతగా డబ్బు చేసుకుంటూ వచ్చాడు. ఒక్కొరోజు వాడు కూరలు కోసుకుపోయాక పాపన్నకే కూరలు మిగిలేవికావు. అయినా పాపన్న బాధపడ లేదు. రంగడు తన తోటలోని కూరలు సంతలో అమ్ముతున్న సంగతి అతనికి ఏమాత్రం తెలీదు.

అయితే ఈ సంగతి ఒకవిధంగా అతని చెవినపడింది. ఇరుగుపొరుగు అమ్మ లక్కలు, పాపన్న భార్య అయిన మీనాక్షితో, "మీవారి కూరలవ్యాపారం బాగానే సాగు తున్నట్టుందే!" అన్నారు.

ఈ మాటలకు మీనాక్షి ఆశ్చర్యపడి, "మావారా? ఆయన వ్యాపారం చేస్తారా? ఎక్కడిమాట!" అన్నది.

"ఆయన ఎందుకు చేస్తారులే? కూర లను రంగడి చేత సంతలో అమ్మిస్తున్నారు," అన్నారు అమ్మలక్కలు.

తరవాత మీనాక్షి పాపన్నతో, "మీరు రంగడి చేత మన తోటలో కూరల్ని సంతలో





అమ్మిస్తున్నారా? ఇరుగు పొరుగువాళ్ళు అంటున్నారే!" అన్నది.

పాపన్న కిటువంటి పుకార్లంటే విసుగు.

"వాడింటికి బంధువులు వచ్చారంటే జాస్తిగా కూరలు తీసుకుపోనిస్తున్నాను. లోకులకు వేరే పనేముంది? లేనిపోనివన్నీ కల్పించి చెప్పుతుంటారు, నువ్వవేమీ నమ్మకు," అన్నాడతను.

ఒకనాడు రంగడు తోట నుంచి గంపెడు కూరలూ తీసుకుపోతూండగా, కాలు మడత బడి బెణికింది. వాడు అతి కష్టంమీద ఇల్లు చేరుకుని, పదేళ్ళవాణ్ణి తన కొడుకును పిలిచి, "ఈ కూరలు సంతలో అమ్మి రెండు రూపాయలు పట్టుకు రాగలవ్రా?" అని అడిగాడు.

రంగడి కొడుకు, "ఓ!" అన్నాడు.

"గంప చాలా బరువురా! నువు మొయ్య గలవా?" అన్నాడు రంగడు.

"ఓ!" అన్నాడు రంగడి కొడుకు.

తప్పేది లేదు గనక, రంగడు తన కొడుక్కు ఏవి ఏ ధర కమ్మాలో వివరంగా చెప్పి, కూరలగంప వాడి నెత్తికి ఎత్తి, సంతకు సాగనంపాడు.

రంగడి కొడుకు గంప నెత్తిన పెట్టుకుని సగందూరం కూడా పోక మునుపే మెడ నొప్పి తీవ్రంగా వచ్చేసింది.

వాడు ఎదురుగా వచ్చే పెద్ద మనిషిని చూసి, "బాబ్బాబు! గంపదింపి పెట్టండి," అని అడిగాడు. ఆ పెద్దమనిషి పాపన్నే.

అతను గంప దింపుతూ, "వేలెడులేవు, ఇంత బరువు నెత్తి కెత్తుకున్నావెందుకు? దీన్ని ఎక్కడికి తీసుకుపోతున్నావు? పెద్ద వాళ్ళెవరూ లేరా?" అని అడిగాడు.

"మా అయ్యకు కాలు బెణికిందండి. అందుకని నేనే ఈ కూరలు సంతకు తీసుకు పోతున్నా. వీటిని అమ్మాలిగా?" అన్నాడు.

"దీన్ని తీసుకుని సంత చేరేసరికి నీకు మెడ బెణుకుతుంది. ఈ కూరలన్నీ ఎంత

కమ్ముదా మనుకుంటున్నావో చెప్పు, నేనే కొంటాను," అన్నాడు పాపన్న.

"మా అయ్య వీటిని రెండు రూపాయల కమ్మమన్నాడండి," అన్నాడు కుర్రాడు.

"రెండు రూపాయలిస్తాను, మా ఇంటికి రా," అని పాపన్న కూరల తట్టను తానే ఎత్తుకుని, రంగడి కొడుకును తన వెంట ఇంటికి తీసుకుపోయి, రెండు రూపాయలిచ్చి పంపేశాడు.

కుర్రాడు ఇంటికిపోయి, "కూరలు దారి లోనే అమ్ముడయాయి. ఎవరో ఆయన కూరలన్నీ కొనేసి డబ్బిచ్చాడు," అంటూ రంగడికి రెండు రూపాయలూ ఇచ్చేశాడు.

"ఎవరో ధర్మాత్ముడు!" అని రంగడు నిట్టూర్చాడు.

మర్నాటికి రంగడి కాలు బాధ కాస్త హెచ్చింది గాని తగ్గలేదు. వాడు కొడుకును పిలిచి, "ఒరే, ఊరి చివర పాపన్నగారి తోట తెలుసుగా? అక్కడికి బుట్ట తీసుకుపోయి, నేను పంపానని పాపన్నగారితో చెప్పి, ఈ బుట్టెడు కాయలు కోసుకుని, సంతలో అమ్మి ఒక రూపాయైనా పట్టుకురా. పాపన్న గారు గంపెడైనా కూర లిస్తాడుగాని నువు మొయ్యలేవు," అని చెప్పి పంపాడు.

రంగడి కొడుకు వచ్చేసరికి తోటలో పాపన్న పాదులు బాగు చేస్తున్నాడు.



కుర్రాడు పాపన్నకు వెనకగా నిలబడి, "మా అయ్య రంగన్న, తమర్ని డిగి కూరలు తెమ్మన్నాడండి!" అన్నాడు.

పాపన్న తల ఎత్తి వెనక్కు తిరిగి చూసి, "ఓరి, నువా?" అన్నాడు.

నిన్న తన దగ్గిర కూరలు కొన్నది పాపన్నే అని తెలియగానే రంగడి కొడుకు బెదిరి, బుట్ట అక్కడే పారేసి పారిపోయాడు. "ఒరేయ్, మాట!" అని పాపన్న కేక పెడుతున్నా వాడు వినిపించుకో లేదు.

వాడు అదే పరుగున ఇంటికి పోయి తన తండ్రితో, "నిన్న నా దగ్గిర కూరలు తీసుకుని రెండు రూపాయ లిచ్చింది పాపన్న గారే! ఆయన్ని తోటలో చూసి పరిగెత్తుకుంటూ వచ్చా," అన్నాడు.

తన మోసం బయట పడినందుకు రంగడు భయపడిపోయాడు. పాపన్న మొహం ఎట్లా చూడాలో వాడికి అర్థం కాలేదు. ఇంతలో పాపన్న రానే వచ్చాడు.

"ఏం, రంగన్నా? నీకేనా కాలు బెణికింది? ఇంకా నయం కాలేదా? ఇంటికొచ్చిన మీ చుట్టాలంతా వెళ్ళిపోయినట్టున్నారే?" అన్నాడు పాపన్న.

రంగడు కుంటుతూ ... పాపన్న కాళ్ల మీద పడి, "బుద్ధి గడ్డి తిని చేశాను, బాబూ, వెధవ పని! మీ రుణం ఎట్లా తీర్చుకోవాలో మీరే చెప్పండి," అని విలవిల లాడాడు.

"దానికేంలే, రంగన్నా? బీదరికం అనేక పనులు చేయిస్తుంది. నీ కెందుకొచ్చిన కర్మ? నా తోట పని చూసుకుంటూ నీ ఖర్చులకు సరిపడా కాయగూరలు అమ్ముకుని నిక్షేపంగా బతుకు," అన్నాడు పాపన్న.

అదిమొదలు రంగడు పాపన్న తోటలో పని చేస్తూ, మరింత బాగా కూరలు పండించి, పాపన్నకు అందకుండా కూరలు కోసి అమ్మి, అందులో ఒక రూపాయి తను ఉంచుకుని, రోజూ రెండు, మూడు రూపాయలు మీనాక్షి చేతిలో పెట్టి పోతూండేవాడు.





# లక్షలసమస్య

ఉజ్జయినీ నగరంలో వరుణశ్రవు డనే గృహస్థు ఉండేవాడు. అతను అస్తమానమూ ఏదో ఒక పని చేస్తూ, ఇతరులకు పనులు చేసిపెడుతూ, తృణమో పణమో సంపాదించుకుంటూ ఉండేవాడు. ఎంత పని చేసినా తన సంపాదన ఎక్కడి కక్కడే సరి పోతున్నదనీ, తాను కొంచెం కూడా వెనక వేసుకోలేక పోతున్నాననీ, తన అనంతరం పిల్లలు బొత్తిగా దిక్కులేని వాళ్ళయిపోతా రనీ అతనికి విచారంగా ఉండేది.

"నేను చివరకు ఏమీ మిగల్చకుండానే చస్తాను!" అని అతను అస్తమానమూ అంటూండేవాడు.

"దానికేం చేస్తాం? ప్రాప్తం ఉన్నంతే వస్తుంది," అనేది అతని భార్య వసుమతి.

ఒకనాడు వారి ఇంటికి ఒక అభ్యాగతి వచ్చాడు. భార్యాభర్తలు అయనకు భోజనం పెట్టారు. మంచీ చెడ్డా మాట్లాడు కునేటప్పుడు వరుణశ్రవుడు తన అలవాటు ప్రకారం, "నేను చివరకు ఏమీ మిగల్చ కుండానే చస్తాను!" అన్నాడు.

"మన ప్రాప్తం ఎలా ఉంటే అలా జరుగుతుంది," అన్నది వసుమతి.

ఈ మాటలు విని అభ్యాగతి, "నాకు సాముద్రికం వచ్చు. మీ చెయ్యి ఇలా ఇవ్వండి. మీ ప్రాప్తం ఎంతదాకా ఉందో నేను చెబుతాను," అని వరుణశ్రవుడి చెయ్యి తీసుకుని పరీక్షించాడు.

చివరకాయన, "మీరు నిష్కారణంగా విచారపడుతున్నారు. ధనరేఖ బాగావుంది. కాని అది కొంచెం ఆలస్యంగా ప్రారంభ మవుతున్నది. బహుశా పైమాసం నుంచీ మీకు బాగా కలిసి రావచ్చు," అన్నాడు.

"నిజంగానా?" అన్నాడు వరుణశ్రవుడు.

"నేను ముఖప్రీతి కోసం చెప్పటంలేదు. మీ ఆయుర్దాయం పూర్తి అయేలోపుగా

పి. నాగేంద్రరావు

మీరు నికరంగా రెండు లక్షలు నిలవచేస్తారు. ఈ మాటకు తిరుగులేదు," అన్నాడు అభ్యాగతి.

ప్రాణం విసిగి ఉన్న వరుణశ్రవుడు అభ్యాగతి మాటలు కొంచెంకూడా నమ్మ లేదు. కాని ఒక నెల గడిచినాక నిజంగానే అతని రాబడి పెరిగింది. అదివరకు రూపాయి వచ్చినచోట ఇప్పుడు రెండు రూపాయలు వస్తున్నది. వెనకటిలాగా సంపాదన అంతా ఖర్చుకావటంలేదు, కొంత మిగులుతున్నది.

వరుణశ్రవుడికి నిరుత్సాహం పోయింది. అతనికిప్పుడు ఎంతో ఆనందం. అతను తన సంపాదనలో మిగిలినదంతా ఒక డబ్బీలో వేసి ఉంచుతున్నాడు. వసుమతికి మాత్రం ఏదో దిగులుపట్టుకున్నది. ఆమె డబ్బీ తీసి అందులో చేరే డబ్బును ప్రతిరోజూ లెక్కిస్తూవుండేది.

కొద్ది సంవత్సరాలు గడిచాయి. ఉజ్జయినీ నగరానికి ఒక పరదేశి వచ్చాడు. అతనొక సమర్థుడైన శిల్పి, కాని కటిక బీదవాడు. ఉన్నదేశంలో శిల్పకళకు ఆదరణలేక, అతను పొట్ట చేత బట్టుకుని ఉజ్జయినికి వచ్చాడు. ఉజ్జయిని రాజుగారికి బహూకరించటానికి అతనొక శిల్పాన్ని కూడా తెచ్చాడు. కాని, అతని చినిగిన బట్టలూ,



మట్టి కొట్టుకుని ఉన్న దేహమూ చూసి, ద్వారపాలకులు అతన్ని తరిమేశారు. ఆ శిల్పి పాపం, నిరాశతోబాటు ఆకలిబాధతో అలమటించుతూ, వీధులన్నీ తిరిగి వరుణ శ్రవుడి ఇంటికి వచ్చాడు.

వరుణశ్రవుడా శిల్పిచేత స్నానం చేయించి, మంచి బట్టలిచ్చి, అన్నం పెట్టి, అతని సంగతి అంతా తెలుసుకున్నాడు. శిల్పి తన సంచిలో నుంచి శిల్పం తీసి వరుణశ్రవుడికి చూపి, దాన్ని తయారు చేసేందుకు తానెంత శ్రమపడిందీ చెప్పాడు.

"ఇటువంటి శిల్పాలను మా రాజుగారు ఆదరిస్తారు. దీనికి రాజుగారి నుంచే బహుమానం రాబట్టగలను, విచారించకండి," అన్నాడు వరుణశ్రవుడు.

"ఆ పని చేసిపెట్టు, బాబూ. రాజుగారిచ్చే బహుమానంలో సగం నీ కిచ్చుకుంటాను," అన్నాడు శిల్పి.

మర్నాడు వరుణశ్రవుడు మంచి దుస్తులు వేసుకుని, శిల్పాన్ని చేతబట్టి రాజుగారి దర్శనార్థం వెళ్ళాడు. రాజుగారి దర్శనం ఆటే కష్టంలేకుండానే అతనికి లభించింది. అతను శిల్పాన్ని రాజుగారి ముందుపెట్టి, "మహారాజా, పరదేశీ శిల్పి దీన్ని తమకు కానుకగా ఇచ్చుకోవాలని నిన్న ప్రయత్నించాడు. అతను చాలా పేదవాడు. అందుచేత అతనికి



తమ దర్శనం దొరికిందికాదు. అతని తర
పున నేను తమకు దీన్ని సమర్పిస్తున్నాను.
దయచేసి స్వీకరించండి," అన్నాడు.

రాజుగారు ఆ శిల్పాన్ని, వరుణశ్రవుడు ఊహించిన దానికన్నా చాలా ఎక్కువగా మెచ్చుకుని, "శిల్పికి ఒక లక్ష, శిల్పానికి మరొక లక్ష—రెండు లక్షలు బహుమతి ఇస్తున్నాం," అన్నాడు.

రాజభటులు రెండు లక్షలూ తీసుకుని వరుణశ్రవుడి వెంట అతని ఇంటికి వచ్చారు. శిల్పి ఆ బహుమానం చూసి ఆనంద బాష్పాలు రాల్చి, "ఇందులో సగం మీది, మీరు తీసుకోండి," అంటూ వరుణశ్రవుడి కివ్వబోయాడు.

వసుమతి కంగారుగా, "వద్దు, తీసుకో కండి. ఒక అరలక్ష తీసుకోండి, చాలు," అన్నది భర్తతో.

వరుణశ్రవుడూ, శిల్పీ కూడా ఆమె ఆందోళన చూసి ఆశ్చర్యపోయారు.

"లక్ష తీసుకోవటానికి నీకెందుకు భయం?" అని వరుణశ్రవుడు భార్యను అడిగాడు.

"ఆ నాడు మీ చెయ్యి చూసి ఆయన చెప్పిన మాట మరిచారా? మీ జీవితం పూర్తి అయేనాటికి మీరు రెండు లక్షలు కూడ బెడతారని ఆయన చెప్పెనే? రెండు లక్షలు కూడకుండా చూడటమే నా పని. కూడబెట్టిన డబ్బు ప్రాణంతో సమానమవు తుందా? ఆ డబ్బు కన్నా ఏనాడైనా మీ ప్రాణమే నాకు హెచ్చు," అన్నది వసుమతి.

ఆమె అన్న మాట శిల్పికి కూడా గుణ పాఠమే అయింది. అతను తనకు రాజుగా రిచ్చిన డబ్బులో తన అవసరాలకు మాత్రమే దగ్గిర ఉంచుకుని, మిగిలినది దానధర్మాల కింద ఖర్చు పెట్టాడు.

వరుణశ్రవుడూ, వసుమతీ కూడా డబ్బు సంపాదన గురించి ఏమీ చింత పెట్టుకోక, చాలాకాలం సుఖంగా జీవించారు.





# ఓటమితో గెలుపు

స్వర్ణపురపు యువరాజు విక్రముడు చాలా అందగాడు. అతనికి తమ కుమార్తెల నిచ్చి పెళ్ళి చెయ్యాలని చుట్టు పక్కల ఉండే రాజులు చాలామంది తొందరపడ సాగారు. ఇలా ప్రయత్నించిన రాజులలో బలవంతులూ, దగ్గిర బంధుత్వాలు గల వాళ్ళూ, అనేక విధాల మొహమోట పెట్ట గలవాళ్ళూ అనేకులున్నారు.

ఈ చిక్కు నుంచి తప్పించుకుని, తనను పెళ్ళాడ గోరిన కన్యను, తనకు కూడా నచ్చినదాన్ని వివాహం చేసుకునేటందుకు విక్రముడు ఒక పథకం ఆలోచించాడు. అతను చుట్టు పక్కల ఉండే అనేక రాజ్యాలకు ఒక ప్రకటన పంపాడు. అందులో ఇలా తెలియజేశాడు:

"నన్ను పెళ్ళాడ గోరిన ఏ రాజకుమార్తె అయినా సరే నన్ను మూడు ప్రశ్నలు అడగ వచ్చు. అందులో ఏ ఒక్క ప్రశ్నకు నేను సమాధానం చెప్పలేకపోయినా నేనామెను పెళ్ళాడేస్తాను. ఈ నిబంధనను అమోదించేవారు నాకు కబురు చేయువచ్చు."

ఈ ప్రకటన వింతగా ఉన్నప్పటికీ, విక్రముణ్ణి పెళ్ళాడ గోరే రాజకన్యలకు ఆశ గొలిపేదిగా ఉన్నది. ఎందరో రాజకన్యలు చాలా క్లిష్టమైన ప్రశ్నలు మూడు ఆలోచించి, విక్రముడికి అహ్వానాలు పంపారు.

విక్రముడు ఒక్కొక్క రాజ్యానికీ వెళ్ళి, రాజకన్యలను చూశాడు. వారు అతనికి నచ్చ లేదు. వారు వేసే ప్రశ్నలకు ఏవో సమాధానాలు చెప్పి, "నేను ఓడిపోలేదు!" అని ప్రకటించి వారివద్ద సెలవు తీసుకుని మరొక చోటికి వెళ్ళిపోతూ వచ్చాడు.

ఇలా అనేకమంది కన్యలను చూసి అతను చంద్రదేశం చేరాడు. చంద్రదేశపు రాజకుమార్తె అయిన చంద్రిక కూడా అతనికి అహ్వానం పంపి ఉన్నది.

ఆర్. సూర్యావతి

చంద్రికను చూడగానే విక్రముడికి, ఆమెను చేసుకోవాలన్న కోరిక పుట్టింది. ఆమె తనను ప్రశ్నలు వెయ్యటానికి వచ్చి తనకు ఎదురుగా కూర్చునేసరికి అతను, "సంకోచించవద్దు. ఎంత కఠినమైన ప్రశ్నలైనా అడగవచ్చు," అని ఆమెతో అన్నాడు.

"నా మొదటి ప్రశ్న: మనిషికి పూర్ణత్వమూ, పరిపూర్ణత్వమూ, సంపూర్ణత్వమూ ఎలా సిద్ధిస్తాయి?" అని చంద్రిక అడిగింది.

"పెళ్ళితో పూర్ణత్వమూ, విద్యా బుద్ధి లోకానుభవాలతో పరిపూర్ణత్వమూ, మృత్యుసంప్రాప్తితో సంపూర్ణత్వమూ మనిషికి లభిస్తాయి," అన్నాడు విక్రముడు.

"రెండవ ప్రశ్న: డబ్బుతోగాని, అధికార పదవులతోగాని సాధించరానిదేది?" అని చంద్రిక మళ్ళీ అడిగింది.

"అలాటివి ఎన్నయినా ఉన్నాయి. ఒకటి రెండు ఉదాహరణలిస్తాను—పితికిన పాలు ఆవుపొదుగు లోకి తిరిగి పంపటం సాధ్యం కాదు; వండిన అన్నాన్ని బియ్యంగా మార్చటం అసాధ్యం," అన్నాడు విక్రముడు.

"ఆఖరు ప్రశ్న: మూర్ఖుడితో తగాదా వస్తే ఏంచెయ్యాలి?" అని చంద్రిక అడిగింది.

విక్రముడు ఈ ప్రశ్నకు జవాబు చెప్పలేదు. చంద్రదేశపురాజు తన కుమార్తె గెలిచినట్టుగా భావించి, ఆమెను పెళ్ళాడమని విక్రముణ్ణి కోరాడు. విక్రముడు అభ్యంతరం చెప్పలేదు.

వివాహం పూర్తి అయాక చంద్రిక తన భర్తను, "అంత చిన్న ప్రశ్నకు జవాబు చెప్పలేక ఓడారేమిటి?" అని అడిగింది.

"నీ ప్రశ్నకు జవాబు మౌనంగా ఉండటమే. ఆ సమాధానం నోటితో చెప్పటానికి బదులు సంజ్ఞగా చెప్పాను. అందువల్ల నాకు కలిగిన లాభమేమిటంటే, నిన్ను భార్యగా సంపాదించుకున్నాను," అన్నాడు విక్రముడు.





# దోమ పులి రంగారావు

విజయనగరానికి పది మైళ్ళ దూరంలో తుమ్మలపల్లె అనే చిన్న గ్రామంలో రంగడు అనే పశువులకాపరి ఉండేవాడు.

రంగడు తెలివి గలవాడే గాని, చదువు లేని కారణం చేత వాడి తెలివి రాణింపుకు రాలేదు. వాడి తండ్రి చిన్నతనంలోనే పోయాడు. తల్లి కునిష్టిది. అందుచేత సంసార భారం వాడే మొయ్యవలసి వచ్చింది. వాడు మంచి బలశాలి. ఎంతటి వాళ్లతోనైనా చొరవగా మాట్లాడేవాడు.

ఇరవైఏళ్ళు వచ్చేసదాకా రంగణ్ణి తోటి పసులకాపర్లు "దోమపులి రంగడు" అని పిలిచేవాళ్ళు. ఎందుకంటే వాడికి దోమలను చంపటం ఒక సరదా.

ఇలా ఉండగా విజయనగరం చుట్టుపట్ల ఉండే అడవులలోకి ఒక పెద్దపులి ప్రవేశించి, రోజూ పశువులను చంపుతూ రాసాగింది. రాజుగారు దాన్ని వేటాడటానికి ఎన్నోసార్లు బయలుదేరి వెళ్ళాడు, కాని దాని జాడ ఆయనకు చిక్కలేదు. అందు చేత ఆయన పులిని చంపినవారికి బహుమానం ఇస్తామని ప్రకటించాడు.

ఈ ప్రకటన తుమ్మలపల్లె చేరినప్పుడు రంగడి మిత్రులు, "దోమపులిరంగా, నువు పెద్దపులిని చంపరాదూ? పెద్దపులి రంగారావు బహదూర్ అనే పేరు వస్తుంది," అని వేళాకోళం చేశారు.

మిత్రులిలా పరాచకాలాడిన మీదట రంగడికి మరో ఆలోచన కలిగింది. వాడు తన తల్లికి తప్ప ఇంకెవరికీ ఏమీ చెప్పక, ఒకనాటి రాత్రి విజయనగరానికి బయలుదేరి వెళ్ళాడు. వాణ్ణి కోట ద్వారం వద్ద కాపలా వాళ్ళు చూసి, "ఎవరు నువు? ఏం పని?" అని అడిగారు.

"నేను పెద్దపులిని చంపగలను. నన్ను రాజుగారి వద్దకు పోనివ్వండి," అన్నాడు

కె. వెంకట్రాజు



రంగడు. వాళ్ళు రంగణ్ణి రాజుగారి వద్దకు తీసుకుపోయారు.

"మహారాజా, నన్ను దోమపులి రంగారావు అంటారు. నేను ఇదివరకు చాలా జంతువులను చంపి ఉన్నాను. తమరు అనుమతిస్తే పెద్దపులిని చంపగలను," అన్నాడు రంగడు రాజుగారితో.

"మంచిదే. కాని, పులిని చంపదలచినవాడివి, అడవికి పోక ఇక్కడి కెందుకు వచ్చావు?" అని రాజు అడిగాడు.

"నిజమే, మహారాజా! అయితే నేను చాలా పేదవాణ్ణి. పైగా ఈ మధ్య జబ్బు పడ్డాను. అందుచేత శుష్కించి ఉన్నాను. ఏలినవారు పది రోజుల పాటు మంచి ఆహారం పెట్టించినట్టయితే పుంజుకుని పోయి పులిని చంపగలను," అన్నాడు రంగడు.

అందుకు ఒప్పుకుని రాజుగారు రంగడికి భోజనపు ఏర్పాట్లు చేయించాడు. రంగడు రోజు కొక మేకమాంసమూ, మూడుశేర్ల పాలూ ఆరగించి, మంచి వ్యాయామం చేస్తూ హాయిగా రోజులు గడపసాగాడు.

నెల రోజులు గడిచిపోయింది. రంగడింకా పులి వేటకు ఎందుకు వెళ్ళలేదో కనుక్కోమని రాజుగారు కబురు చేశారు. "నాకు ఒక తుపాకీ, కొన్ని తూటాలూ, కొంత డబ్బూ ఇప్పిస్తే వెంటనే బయలు దేరుతున్నా," నని రంగడు రాజుగారికి తెలియ బరిచాడు. రంగడు కోరినవన్నీ రాజుగారు ఇప్పించాడు.

రంగడు బయలుదేరి, ఎవరికీ తెలియకుండా రాత్రివేళ తన ఇల్లు చేరి, "మనం ఈ ఊరు నుంచి మరో ఊరికి వెళ్లిపోవాలి. వెంటనే బయలుదేరు," అని తల్లితో చెప్పాడు. తల్లి కుండలలో అన్నమూ, పెరుగూ, పాలూ, నీళ్ళూ పెట్టి, కుండల దొంతి నెత్తిన పెట్టుకున్నది. రంగడు తుపాకీ, తూటాలూ, కత్తీ, గొడ్డలీ తీసుకున్నాడు. ఇద్దరూ బయలుదేరారు.

తెల్లవారిన దాకా వాళ్ళు అడవిలో ఒక చెట్టు మీద ఉండి, తరవాత మరొక గ్రామానికి పోదామని అనుకున్నారు. ఒక పెద్ద మర్రిచెట్టు కనబడింది. ఒక కొమ్మ మీద తల్లిని ఉంచి, ఆ కొమ్మకే కుండల దొంతిని వేళ్ళాడగట్టి, రంగడు మరొక కొమ్మను ఆశ్రయించాడు.

దైవికంగా పెద్దపులి అటుగానే వచ్చింది. చెట్టు మీద మనుషులున్నట్టు పసికట్టి, అది చెట్టు మీదికి ఎగరటానికి ప్రయత్నించింది. అలా ఎగరటంలో దానికి కుండల దొంతి తగిలింది. కుండలు ఒరిగి పెద్దపులి నెత్తిన పడ్డాయి.

ఇదే మంచి అవకాశమనుకుని రంగడు పులిని తుపాకితో కాల్చబోయాడు. కాని ఇంతలో రంగడి తల్లి భయంతో కొమ్మపట్టు తప్పి, తిన్నగా పులి మీదనే పడింది.

ఆ పాటుకు పులి బెదిరి, పరిగెత్తుకుంటూ పోయి, సమీపంలో ఉన్న నీరు లేని బావిలో పడి, బొబ్బరించ నారంభించింది. రంగడి తల్లి నేలపై స్పృహ లేకుండా పడిపోయింది. పులి గాండ్రింపు వినిపిస్తూనే ఉన్నది. అది బావిలో పడిందని తెలియక, రంగడు చెట్టు దిగి రావటానికి సాహసించలేక పోయాడు.

చివరకు తెల్లవారింది. వాడు చెట్టు దిగి బావి వద్దకు వెళ్ళి, తుపాకితో పులిని చంపేశాడు. తరవాత వాడు పక్క గ్రామానికి వెళ్ళి బండి తెచ్చి, పులిని దాని మీద వేసుకుని విజయనగరం వెళ్ళి, రాజుగారి దర్శనం చేసుకున్నాడు.

పులిని చంపినందుకు రాజుగారు చాలా సంతోషించి రంగడికి ఒక గ్రామం ఈనాముగా ఇచ్చేశాడు. రంగడికీ, తల్లికీ మంచి మంచి కానుకలు కూడా ఇచ్చేశాడు. రంగడు కాస్తా దోమపులి రంగారావు బహద్దరుగా పేరు ప్రఖ్యాతులు సంపాదించుకుని, సుఖంగా జీవించాడు.







# మాటపట్టింపు

ఆనందపురం మహారాజుకు నలుగురు భార్యలు. నలుగురూ అందగత్తెలే. అయితే ఒక్కొక్కరిలో ఒక్కొక్క ప్రత్యేకత ఉండేది. ఒకామెకు జుట్టులో హెచ్చు అందం; రెండో ఆమెకు ముక్కు అందం; మూడో ఆమెకు కన్నులు అందం; నాలుగో ఆమెకు చెక్కిళ్ళు అందం. రాజుకు నలుగురి భార్యల మీదా సమానప్రీతి. నలుగురు రాణులకూ పిల్లలున్నారు.

ఒకనాడు రాజు నేత్రసుందరి అయిన తన మూడో భార్యతో సహా మిద్దె పైన విహారం చేస్తూ ఉండగా దూరం నుంచి ఒక పక్షి ఎగురుతూ అటుకేసి రావడం కనిపించింది. రాజు ఆ పక్షిని పరీక్షగా చూడసాగాడు.

"ఆ కాకిని అంత పరీక్షగా చూస్తున్నా రేమిటి?" అని నేత్రసుందరి ఆశ్చర్యంగా రాజును అడిగింది.

"అది కాకిలాగా లేదు, గరుడపక్షి అయి ఉండాలి," అన్నాడు రాజు.

"అది ముమ్మాటికి కాకే! గరుడపక్షి కానే కాదు," అన్నది రాణి.

"గరుడపక్షే. ఇటు కేసే వస్తున్నది. త్వరలోనే తెలిసిపోతుంది, తొందరెందుకు?" అన్నాడు రాజు.

"అది కాకి కాకపోతే నేను అరణ్యానికి పోతాను. కాకి అయితే మీరు పోతారా?" అన్నది రాణి.

రాజు నవ్వి, "అలాగే పోతాను," అన్నాడు. కొంచెం సేపటికి పక్షి సమీపంలోకి వచ్చి, "కృష్ణా!" అని కేక వేసింది. అది గరుడ పక్షి!

"చూశావా? నువు కావటానికి నేత్ర సుందరివే గాని నీ దృష్టి అంత బాగా లేదు. తొందరపడి పందాలు వెయ్యకు," అంటూ రాజు మేడ దిగి కిందికి వెళ్ళిపోయాడు.

బి. నళ్యానందం

అంతసేపూ దూరాన కూర్చుని ఉన్న పెంపుడు చిలక ఎగురుతూ వచ్చి, "మూడో రాణి పందెం వేసి ఓడి పోయిందా?" అని ఎటో వెళ్ళిపోయింది.

పందెం ఓడినందుకే అవమానంతో కుమిలి పోతున్న మూడో రాణికి, చిలక మిగతా రాణులతో ఈ సంగతి చెప్పేస్తుం దన్న అనుమానం కూడా పట్టుకున్నది. అందుచేత ఆమె తన రెండేళ్ళ వయసుగల కుమార్తెను, తేజస్వినిని, వదిలి పెట్టి, ఆ రాత్రి తాను ఒంటరిగా, ఎవరికీ చెప్ప కుండా, ఒక దాసీ దాన్ని వెంట పెట్టుకుని అరణ్యాలకు వెళ్ళిపోయింది.

మర్నాడు మూడో రాణి కనిపించక పోయేసరికి అంతఃపురంలో ఆందోళన బయలుదేరింది. రాజు ఒక్కడే జరిగినది ఊహించి, తన మూడో భార్య పౌరుషాన్ని మెచ్చుకున్నాడు. ఆయన మిగిలిన వాళ్లతో, "మీరేమీ కంగారు పడకండి. నేత్రసుందరి త్వరలోనే తిరిగి వస్తుంది" అన్నాడు. తన మూడో భార్య అరణ్యంలో ఎంతోకాలం ఉండలేదని రాజు నమ్మకం.

అయితే ఈ విషయంలో రాజు పొర పడ్డాడు. నేత్రసుందరి అరణ్యంలో చాలా దూరం వెళ్ళి, ఒక అడవిపల్లె చేరుకుని, అక్కడ ఒక ముసలిదానికి కొంత ధనం





ఇచ్చి, ఆ ఇంటనే ఆశ్రయం ఏర్పాటు చేసుకున్నది. తాను దిక్కులేని దాన్నని ఆమె ఆ గ్రామంలోని వారితో చెప్పింది.

మూడో రాణి ఇంటి నుంచి బయలుదేరేసరికే గర్భవతి. సకాలంలో ఆమెకు ఒక మగబిడ్డ కలిగాడు. వాడికి తేజసింహుడని పేరు పెట్టుకున్నది. తనకూ, తన బిడ్డకూ వెంట వచ్చిన దాసీదే సమస్త ఉపచారాలూ చేసేది.

అయిదేళ్ళు గడిచాయి. ఇల్లుగల ముసలిది చనిపోయింది. ఆ ఇల్లు మూడో రాణి దయింది. తేజసింహుడు ఎదిగి వస్తున్నాడు. అతనికి అయిదేళ్ళు నిండగానే మూడో రాణి దాసీదాన్ని తోడిచ్చి నగరానికి పంపించి, విద్యాభ్యాసానికిగాను గురుకులంలో చేర్పించింది.

తేజసింహుడు గురువు వద్ద శ్రద్ధగా చదువుకుంటూ, ఆటవిడుపులకు తల్లి దగ్గిరికి వచ్చి పోతూ ఉండేవాడు. అతనికి పదమూడేళ్ళు నిండాయి.

ఒకనాటి ఉదయం తేజసింహుడు నదికి స్నానానికి వెళ్ళేసరికి, నదీ తీరాన మూడు రంగుల రత్నం ఒకటి దొరికింది. అతను దాన్ని తీసుకు వచ్చి తన గురువుకు సమర్పించాడు. అది రాజుల వద్ద ఉండదగిన రత్నమనీ, అటువంటిది తన వద్ద ఉంటే రాజుకు ఎలాగూ తెలిసిపోతుందనీ అనుకుని గురువుగారు దాన్ని తీసుకుపోయి రాజుగారికి కానుక పెట్టాడు.

"ఇది మీకు ఎలా దొరికింది?" అని రాజు గురువును అడిగాడు.

"నా శిష్యుడు తేజసింహుడు స్నానానికి పోతే నదీతీరాన దొరికిందట," అని గురువు ఆయనకు చెప్పాడు.

రాజుగారు గురువుకు నూరు సువర్ణాలిచ్చి, "మీ శిష్యుడు తేజసింహుణ్ణి కూడా నా వద్దకు పంపండి. అతను కూడా బహుమానం పొంద దగినవాడే," అన్నాడు.

రాజభవనంలో పెరుగుతున్న తేజస్విని ఇప్పుడు పదహారేళ్ళ పిల్ల. ఆమెకు వివాహం కావలసి ఉన్నది. ఈ త్రివర్ణ రత్నాన్ని ఉపయోగించి తేజస్వినికి మంచి చంద్ర హారం తయారు చేయమని రాజు నగల వర్తకులను పురమాయించాడు.

ఈ లోపల గురువుగారు తన ఇంటికి తిరిగి వెళ్ళి తేజసింహుడితో, "నీకు దొరికిన రత్నాన్ని రాజుగారు మెచ్చుకున్నారు. ఆయన నిన్ను కూడా చూస్తామన్నారు. పోదామా ?" అన్నాడు.

"నే నలా రాను. తన అనుమతి లేకుండా నన్ను ఎక్కడికీ వెళ్ళవద్దని మా అమ్మ శాసించింది. ఆమె అనుమతి అయితేనే గాని నేను రాజుగారి వద్దకు రాలేను," అన్నాడు తేజసింహుడు.

గురువుగారు రాజు వద్దకు వెళ్ళి ఆయనతో ఈ మాటే చెప్పాడు.

తేజసింహుడి తల్లి అరణ్యంలో ఫలాని గ్రామంలో ఉంటున్నదని తెలిసి రాజు అక్కడికి తన భటులను పంపి, తేజసింహుడి తల్లిని, "మీ అబ్బాయి రాజభవనం రావటానికి అనుమతించవలసింది," అని అడిగించాడు.

రాజభటులు వచ్చి రాజుగారి కోరిక చెప్పగానే మూడో రాణి రోషంగా, "మేము



అరణ్యవాసులం. నా కొడుకు రాజభవనా లలో అడుగు పెట్టడు," అని జవాబు చెప్పి పంపేసింది.

రాజభటులు వెళ్ళి రాజు కీ సంగతి చెప్పి, "మహారాజా, ఆవిడ ఎవరో రాజ వాసం మనిషిగాని, మామూలు మనిషి కాదు," అన్నారు.

ఆమె తన మూడో భార్య అయిన నేత్ర సుందరి అయి ఉండవచ్చునని రాజుకు అనుమానం వేసింది. ఆయన తేజస్వినిని వెంట బెట్టుకుని మూడో రాణి ఉండే చోటికి బయలుదేరాడు. ఆయన వెంట అంతః పురంలో ఉండే చిలక కూడా బయలు దేరిపోయింది.

పధ్నాలుగేళ్ళు గడిచిపోయినప్పటికీ రాజు నేత్రసుందరిని చూస్తూనే గుర్తించ గలిగాడు.

"ఎంత పెడకటైవు? ఇన్నాళ్ళు ఈ అరణ్యవాసం ఎందుకు చేసినట్టు? నీకు కొడు కెప్పుడు కలిగాడు?" అని రాజు తన మూడో భార్య నడిగాడు.

"ఇక్కడికి వచ్చిన ఆరుమాసాలకు పుట్టాడు. పందెంలో ఓడిపోయాను. అర ణ్యానికి పోతానన్న మాట నిలబెట్టు కున్నాను," అన్నది మూడోభార్య.

"అరణ్యానికి పోతానన్నావు గాని, అరణ్యంలో ఉంటాననలేదు. ఎంత తెలివి తక్కువ దానివి!" అని చిలక యుద్దేవా చేసింది.

"చిలక బాగా చెప్పింది. నీ కూతురికి త్వరలో పెళ్ళి జరగబోతున్నది. నీ పంతం నెగ్గించుకున్నావుగా, ఇక ఇంటికి వచ్చెయ్యి," అన్నాడు రాజు.

నేత్రసుందరి మెత్తబడి తన భర్త వెంట నగరానికి బయలుదేరి వచ్చేసింది. రాజు తన కొడుకైన తేజసింహుణ్ణి కూడా గురు కులం నుంచి ఇంటికి పిలిపించుకున్నాడు. అందరూ సుఖంగా ఉన్నారు.







# వేలిమీది గోరు

అక్బరు పాలించే కాలంలో ఒకానొక దేశాన్ని పాలించే రాజు యుద్ధంలో తన వేలి మీది గోరు పోగొట్టుకుని గాయపడ్డాడు. వైద్యులు వేలిగాయం మానేటట్టు చేశారు గాని, వేలి మీది గోరును తిరిగి తెప్పించ లేకపోయారు.

రాజుకు చాలా కోపం వచ్చింది. ఆయన తన ఆస్థాన వైద్యుల నందరినీ ఖైదులో పెట్టించి, రాజ్యంలో ఉన్న వైద్యులందరికీ హెచ్చరిక చేశాడు. రాజుగారు పోగొట్టుకున్న గోటిని తిరిగి తెప్పించటం ఏ వైద్యుడి వల్లా కాలేదు. వైద్యులందరినీ రాజు కారా గృహంలో పెట్టించాడు. కొందరు వైద్యులు దేశం వదిలి పారిపోయారు. మరి కొందరు తాము వైద్యం మానుకున్నామని ప్రకటిం చారు. అలా ప్రకటించిన వాళ్ళు తమ ఆప్తులకూ, అంతరంగికులకూ తప్ప మందు లివ్వటానికి భయపడవలసి వచ్చేది. ఎందుచేతనంటే వాళ్ళు ఎవరికైనా చిన్న కస్తూరి మాత్ర ఇచ్చినట్టు తెలిసినా రాజు వాళ్ళను తెచ్చి కారాగృహంలో బంధించేవాడు. ప్రజల రోగాలకు మందు లిచ్చేటందుకు ఒక్క వైద్యుడు కూడా లేకపోవటం చేత దేశం అల్లకల్లోల మయింది.

ఫలాని దేశంలో రాజు తన రాజ్యంలోని వైద్యులను ఖైదు చేయించాడనీ, కొంత మంది వైద్యులు ఖైదుశిక్షకు భయపడి పారి పోయారనీ, ఆ దేశంలో రోగులు చాలా దారుణమైన స్థితిలో ఉన్నారనీ అక్బరు పాదుషాకు తెలియవచ్చింది. ఆయన బీర్బల్‌ను పిలిచి, సంగతంతా చెప్పి, "ఖైదులో ఉన్న ఆ వైద్యులను ఎలాగైనా చెర విడిపించు," అని ఆదేశించాడు.

బీర్బల్ వైద్యుడి వేషం వేసుకుని ఆ రాజ్యానికి వెళ్ళి, రాజధానిలో ఒక గృహ స్థుడి ఇంట బసచేసి, ఆ గృహస్థుడితో,

ఎస్. ఉదయశంకర్

"అయ్యా, నే నొక ఘనవైద్యుణ్ణి. నాకు తమ రాజుగారి దర్శనం చేయించగలరా ?" అని అడిగాడు.

"నువు మా రాజ్యాని కెందుకు వచ్చావయ్యా, బాబూ? మా రాజుగారికి వైద్యులంటే చాలా కోపం. వైద్యుణ్ణని చెప్పుకున్న వాడినల్లా ఆయన కారాగృహంలో పెట్టించాడు. వైద్యుణ్ణని చెప్పుకోవటమే ఈ దేశంలో మహాపచారం. పై పెచ్చు రాజ దర్శనం కూడా చేస్తావా? నా మాట విని అలాంటి పని చెయ్యకు," అన్నాడు గృహస్థు.

అయినప్పటికీ బీర్బల్ మర్నాడు రాజ దర్శనార్థం వెళ్ళాడు.

రాజు బీర్బలును తన సమక్షానికి రానిచ్చి, "అయితే నీవు వైద్యుడివా?" అని అడిగాడు అనుమానిస్తూ.

"చిత్తం, మహారాజా! వైద్యంలో నన్ను మించగలవాడు ప్రపంచంలో లేడు," అన్నాడు బీర్బల్.

"అలా అయితే ఈ వేలి మీద గోరు మొలిపించు," అని రాజు బీర్బల్‌కు తన గోరు లేని వేలు చూపాడు.

"ఇదొక గొప్ప విద్యా ఏమిటి? అయితే, నేను దూర దేశం నుంచి వస్తున్నవాణ్ణి కావటం చేత నా దగ్గర ఈ చికిత్సకు కావలిసిన దినుసు లేదు. ఆ దినుసు మీ దేశంలో



దొరుకుతుందో లేదో నాకు తెలీదు," అన్నాడు బీర్బల్.

"నేను ఆజ్ఞ ఇచ్చానంటే ఏదైనా వస్తుంది. ఏమిటి నీకు కావలసిన దినుసు?" అని రాజు బీర్బలును అడిగాడు.

"అయితే పదితులాలు మేడిపూలు తెప్పించండి. ఒక నెలలోపుగా తెప్పించినట్టయితే నే నీ లోపుగా మిగిలిన దినుసులు సిద్ధంచేసి ఉంచుతాను. నెలలోగా తెప్పించకపోతే నేను ఉపయోగించే మిగతా దినుసులన్నీ వ్యర్థమైపోతాయి. అందుచేత మేడిపూలు తెప్పిస్తానని నాకు మీరు మాట ఇవ్వాలి," అన్నాడు బీర్బల్.

"నెలరోజులు కూడా అవసరం లేదు. పదిహేను రోజులలో తెప్పిస్తాను," అన్నాడు రాజు ధీమాగా.

"తెప్పించలేకపోతే?" అన్నాడు బీర్బల్.

"నువ్వేది చెయ్యమంటే అది చేస్తాను," అన్నాడు రాజు.

మేడిపూ లుండవని తెలియని రాజు వాటిని వెంటనే తెమ్మని తన మంత్రులను ఆజ్ఞాపించాడు.

నెల దాటిపోయింది. బీర్బల్ రాజును కలుసుకుని, "మహారాజా, నెల కూడా దాటిపోయింది. మేడిపూలు ఇంకా రాలేదు," అన్నాడు. రాజు మంత్రుల మీద ఎగిరాడు. మంత్రులు నేరాన్ని తమ భటుల మీదికి తోసేశారు.

"అయితే ఏం చెయ్యమంటావిప్పుడు?" అని రాజు బీర్బలును అడిగాడు.

"వైద్యులందరినీ ఖైదు నుంచి విడుదల చెయ్యండి. నేను ఏమి చెయ్యమంటే అది చేస్తానని మీరు మాట ఇచ్చి ఉన్నారు," అన్నాడు బీర్బల్.

రాజు వైద్యులను విడుదల చేశాడు. బీర్బల్ యుక్తి గురించి విని వైద్యులు పరమానంద భరితులై, అతనికి తమతమ శక్తికొద్దీ బహూమానా లిచ్చి పంపేశారు.





# కుంటికోతి

ఒక ఊళ్లో ఒక తల్లీ, ఆ తల్లికి తగ్గ కొడుకూ ఉండేవారు. ఆ తల్లి గారాబంతో కొడుకు పట్టి మొద్దబ్బాయిగా తయారయాడు. ఏళ్ళు మీదపడుతున్నా వాడు తల్లికి చిన్నమెత్తు సహాయం చెయ్యలేక పోయాడు. తన కొడుకు ఎలా బతుకుతాడో ఏమోనని తల్లి లోలోపల బాధపడేది.

ఒక రోజు ఒక కోతులవాడు వాళ్ళ ఇంటి ముందుకు వచ్చి, తన దగ్గిర ఉన్న కోతులలో ఒక దానిచేత రకరకాల పనులు చేయించసాగాడు. యజమాని పొమ్మంటే ఆ కోతి పోతుంది, మళ్ళా రమ్మంటే వస్తుంది; ఏదైనా వస్తువు తీసుకోమంటే తీసుకుంటుంది, ఇచ్చెయ్యమంటే ఇచ్చేస్తుంది; చీపిరికట్ట చేతికిచ్చి చిమ్మమంటే చిమ్ముతుంది. ఇలా అది ఎన్నో పనులు చేసి, ఆట అయిపోయాక, అందరి దగ్గిరికీ వచ్చి డబ్బులు అడగసాగింది. అది మొద్దబ్బాయి దగ్గిరికి కూడా వచ్చి చెయ్యి చాచింది. వెంటనే మొద్దబ్బాయి తన చేతిలో ఉన్న కర్రతో కోతికాలి మీద బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు కోతి కాలు కాస్తా విరిగి పోయింది.

కోతులవాడు మండిపడి, "నా కోతి కాలు విరగగొట్టావు. దీని ఖరీదు మూడు రూపాయలూ ఇచ్చి దీన్ని నువే ఉంచుకో!" అన్నాడు. చేసేదిలేక, మొద్దబ్బాయి తల్లి, మూడు రూపాయలిచ్చి, కోతిని తీసుకున్నది.

పేదరాలే తన కొడుక్కు కోతిని కొని పెట్టినప్పుడు, మనమేనా తీసిపోయిందని, ఊళ్ళో మరి కొందరు కోతులవాడి దగ్గిర ఉన్న కోతులన్నిటినీ కొనుక్కున్నారు.

అయినా కుంటి కోతే ఊరికంతకూ ప్రసిద్ధమయింది. దానికి ఏ పని చెప్పినా, కుంటుకుంటూ చేస్తుంది. కోతి వేషాలు వెయ్యదు. దానిని చూస్తూ మొద్దబ్బాయి

జె. కుమారస్వామి

కూడా చిల్లరమల్లరపనులు చెయ్యసాగాడు. కోతి రోకలి తీసుకుని వడ్లు దంచేది, రోటి దగ్గిర కూర్చుని పిండి రుబ్బేది. తల్లి మొద్ద బ్బాయితో, "చూశావురా, కోతి ఎంత బాగా పనులు చేస్తున్నదో? నీకన్న అదే నయం!" అనేది. ఆ మాటకు రోషం వచ్చి మొద్ద బ్బాయి కోతిని లేవగొట్టి, అది చేసే పనిని తానే చేసేసేవాడు.

తన కొడుకు కోతిని చూసి పౌరుషం తెచ్చుకోవటం చూసి తల్లి ఒకనాడు, "కోతి నాయనా! నువూ, అన్నయ్యా అడవికి పోయి ఎండు పుల్లల మోపు తీసుకు రండి. ఎవరు పెద్ద మోపు తెస్తారో చూద్దాం!" అన్నది. కోతికి ఆ మాట అర్థమయింది. అది వెంటనే అడవికి బయలుదేరింది. అది బయలుదేరటం చూసి మొద్దబ్బాయి కూడా అడవికి బయలుదేరాడు,

అడవికి పోయిన కోతి ఎండు పుల్లలు ఏరి ఒక చోట పోగువేస్తూండగా ఎవరో మనిషి అటుగా వచ్చి, చుట్టుపక్కల ఎవరూ లేకపోవటం చూసి, ఒక చోట గుంట తవ్వి, డబ్బు సంచి పూడ్చిపెట్టి, వెళ్ళిపోయాడు.

వాణ్ణి వెళ్ళిపోనిచ్చి, కోతి తాను దాగి ఉన్న చోటినుంచి ఇవతలికి వచ్చి, ఆ మనిషి పూడ్చిపెట్టిన డబ్బు సంచీ తీసుకుని, వెంటనే



ఇంటికి తిరిగి వచ్చి, డబ్బు సంచీని తల్లి ముందు పెట్టింది.

కోతి తెచ్చిన డబ్బు సంచీ చూసి తల్లి ఆశ్చర్యపోయింది. అందులోని డబ్బు అవసరానికి వాడుకోవచ్చునని అనుకుని ఆమె దాన్ని భద్రంగా దాచిపెట్టి, రెండు రూపాయలుమాత్రం ఖర్చుకు తీసింది.

సాయంకాలానికి మొద్దబ్బాయి పెద్ద ఎండుపుల్లల మోపుతో తిరిగి వచ్చి, "కోతి వచ్చిందా, అమ్మా? నా కన్న పెద్ద మోపు తెచ్చిందా?" అని అడిగాడు తల్లిని.

"అది ఎప్పుడో వచ్చింది. అది పెద్ద మోపు తెచ్చిందా అని అడుగుతున్నావా?

అది పుల్లలు తీసుకు రావటమే కాదు. ఆ పుల్లలు అమ్మి రెండు రూపాయలు కూడా తెచ్చింది. కావలిస్తే చూసుకో," అంటూ తల్లి తాను సంచీ నుంచి తీసిన రెండు రూపాయలూ చూపించింది.

మొద్దబ్బాయికి ఏడుపొచ్చింది. "ఏమి టమ్మా, నువూ! నన్ను కుంటికోతి కన్న కూడా హీనం చేసేశావు. ఇకనుంచీ నువు దానికి ఏపనీ చెప్పకు. అన్ని పనులూ నాకే చెప్పు," అన్నాడు వాడు.

"నువు నాకు అన్నిపనులూ చేసిపెట్టే టట్టుంటే నేను కోతిచేత ఎందుకు చేయించు కుంటానురా? నిక్షేపంగా నువ్వేచెయ్యి," అన్నది తల్లి.

అది మొదలు మొద్దబ్బాయి ప్రతిపనీ చెయ్యటం నేర్చుకుని ప్రయోజకుడయాడు.

ఈ లోపల, కుంటికోతి అడవికిపోయి కట్టెలుతెచ్చి, వాటిని అమ్మి డబ్బులు తెచ్చి యజమానురాలికి ఇస్తున్నదన్న వార్త ఊరంతా పాక్కింది. కారణ మేమంటే, కోతి తెచ్చిన డబ్బు సంచి ఎవరిదో తెలియ రాలేదు. అందుచేత తల్లి అందులో నుంచి ఒక్కొక్క రూపాయే తీసి వాడుతూ, ఇంత డబ్బు ఎక్కడిదని అడిగినవారితో, "మీకు తెలీదా? మా కోతి అడవికిపోయి వంట చెరుకు తెచ్చి, దారిలో అమ్మి డబ్బు తెస్తుంది," అని చెబుతూ వచ్చింది.

"మనమూ కొన్నాం కోతుల్ని! ఏం లాభం? వాటిని మేపటం తప్ప రాగిదమ్మిడీ లాభం పొందలేదు. మన కోతులకు కూడా కట్టెలు పోగుచెయ్యటమూ వాటిని అమ్మ టమూ నేర్పుదాం!" అనుకున్నారు ఊళ్ళోవాళ్ళు.

వాళ్ళు తమ కోతులను అడవికి తీసుకు పోగానే అవి కాస్తా చెట్లమీదికి ఎక్కేసి, ఒక చెట్టు మీది నుంచి ఇంకొక చెట్టు మీదికి దూకుతూ, తమ యజమానులకు కనపడ కుండా పారిపోయాయి.





# రుజువు

వలభీనగరం వర్తకానికి ప్రసిద్ధి కెక్కిన రోజులలో అనేక దేశాలవాళ్ళు అక్కడికి వచ్చేవాళ్ళు. ఒకసారి ఒక దక్షిణ దేశస్థుడు ఆ నగరానికి వచ్చి తన దగ్గిర ఉన్న అయిదువందల రూపాయలతో వర్తకానికి పనికి వచ్చే సరుకేమైనా ఉన్నదా అని పెద్ద వీధి అంతా తిరిగాడు.

ఆ సమయంలో ఒక ఆడది అకస్మాత్తుగా అతని చెయ్యి పట్టుకుని, "నా దగ్గిర డబ్బు కాజేసి వ్యాపారం చేస్తావా?" అన్నది.

దక్షిణ దేశస్తుడు నిర్ఘాంత పోయి, "నీ డబ్బు నే నెరగను. నువ్వెవరో కూడా నాకు తెలీదు," అన్నాడు.

జనం పోగయారు గాని, ఎవరు అబద్ధ మాడుతున్నదీ తేల్చుకో లేక పోయారు. "వీధిలో ఎందుకు ఘర్షణ పడతారు? న్యాయస్థానం దగ్గిరలోనే ఉన్నది. అక్కడికి వెళ్ళండి," అని సలహా ఇచ్చారు.

ఆడది ఆ పరదేశిని చెయ్యి పట్టుకుని న్యాయాధికారి దగ్గిరికి లాక్కుపోయి, "అయ్యా, ఈ మనిషి నడివీధిలో నా డబ్బు అయిదువందలు బలాత్కారంగా నా వద్ద నుంచి లాగేసుకున్నాడు. నాకు న్యాయం చెయ్యండి," అని వేడుకున్నది.

"సాక్ష్యం ఏమైనా ఉన్నదా?" అని న్యాయాధికారి అడిగితే ఆమె లేదన్నది.

"నువ్వేమంటావు?" అని న్యాయాధికారి దక్షిణదేశస్థుణ్ణి అడిగాడు.

"అయ్యా, నేనీ ఉదయమే ఈ నగరం చేరాను. నా కిక్కడ తెలిసినవారెవరూ లేరు. ఈ మనిషి ఎవరో నాకు తెలీదు. నా దగ్గర అయిదువంద లున్నాయి, నిజమే. అది నా డబ్బే," అన్నాడు దక్షిణదేశస్థుడు.

ఆడది అబద్ధం ఆడుతున్నట్టు న్యాయాధికారి శంకించాడు. తన అనుమానం దృఢ పరచుకోవటానికి ఆయన ఒక యుక్తి

సి. హెచ్. పి. నారాయణరావు

పన్నాడు. ఆయన దక్షిణదేశస్థుడితో, "నీ మాట నమ్మదగినదిగా లేదు. ఆమె డబ్బు ఆమె కిచ్చెయ్యి," అన్నాడు.

చేసేది లేక దక్షిణదేశస్థుడు తన దగ్గిర ఉన్న అయిదువందలూ ఆ ఆడమనిషికి ఇచ్చేశాడు.

న్యాయాధిపతి దక్షిణదేశస్థుణ్ణి దగ్గిరికి పిలిచి, "ఆమె వెనకే వెళ్ళి ఆమె దగ్గిర ఉన్న డబ్బు లాగేసుకో. నీ కేమీ ఇబ్బంది కలగకుండా నేను చూస్తాను," అన్నాడు.

దక్షిణదేశస్థుడు గబగబా వెళ్ళి ఆడమనిషిని కలుసుకుని, ఆమె వద్ద నుంచి తన డబ్బు లాగేసుకోవటానికి ప్రయత్నించాడు. అతను ఎంత ప్రయత్నించినా ఆడమనిషి డబ్బు ఇవ్వలేదు. చుట్టూ జనం పోగయారు.

ఆడమనిషి తిరిగి న్యాయాధికారి ముందుకు వచ్చి, "అయ్యా, తమరు నా కిప్పించిన ఈ డబ్బును ఈ మనిషి తిరిగి లాక్కోవటానికి ప్రయత్నిస్తున్నాడు," అన్నది.

"నిజమేనా? ఈ సంగతి ఎవరైనా చూశారా?" అని న్యాయాధికారి అడిగాడు.

"కావలిస్తే వీళ్ళందరినీ అడగండి. వీళ్ళంతా చూశారు," అంటూ ఆడమనిషి, తన వెనకే వచ్చిన గుంపును చూపించింది.

"అడగక్కర్లేదులే. ఇంతకూ ఆ డబ్బు లాగేసుకున్నాడా?" అని న్యాయాధికారి అడిగాడు.

"నేను లాక్కోనివ్వలేదు," అన్నదామె.

"అదే నేనూ అనుకున్నాను. నీ దగ్గిర నుంచి డబ్బు లాగ గల సత్తా ఆ మనిషికి లేదు. అతను అటువంటి ప్రయత్నం చేస్తే వందమంది పోగయారు. కాని మొదటిసారి అతను నీ దగ్గిర డబ్బు లాగేసుకున్నాడన్నావు. మీ వెంట ఒక్కరూ లేరు. ఆ డబ్బు అతనిదేనని రుజువయింది. వెంటనే ఆ డబ్బు అతని కిచ్చెయ్యి. మరోసారి ఇలా చేశావే, నిన్ను బందిఖానాలో పెట్టిస్తాను," అన్నాడు న్యాయాధికారి.





# కృష్ణావతారం

ద్వారక పైకి దండెత్తి వెళ్ళే సన్నాహంలో ఉండగా పౌండ్రవాసుదేవుడి ఇంటికి నారదుడు వచ్చాడు. పౌండ్రుడు నారదుడికి ఎదురు వెళ్ళి, అర్ఘ్యపాద్యాలిచ్చి, బంగారు ఆసనం మీద కూర్చోబెట్టి, "మహానుభావా, నువు తిరగని లోకం లేదు. ఎక్కడికి పోయినా నిన్నెవరూ అడ్డగించరు. అందుచేత నా కొక సహాయం చెయ్యి. నేను కృష్ణుణ్ణీ, అతని బలగాన్నీ సర్వనాశనం చెయ్యబోతున్నానని అన్ని లోకాలలోనూ చెప్పు. ఆ గొల్లవాడు నా పేరు పెట్టుకుని తిరుగుతున్నాడు," అన్నాడు.

ఈ మాటకు నారదుడు చిరునవ్వు నవ్వి, "నేను సమస్త లోకాలూ తిరిగే మాటా నిజమే, నా మాట అందరూ నమ్మేదీ నిజమే. కాని నువు చెప్పేమాటే అనుమానాస్పదంగా ఉన్నది. కృష్ణుడికీ, నీకూ పోలికేమిటి? కొండ ముందు నలుసులాటివాడివి, నువు కృష్ణుడికి ప్రతి యోధుడివెలా అవుతావు? నిన్ను కృష్ణుడు తప్పక శిక్షిస్తాడు. అందుచేత ఈ ప్రయత్నం మానుకో. నీ పేరూ వాసుదేవుడే గదా అనీ, నీకు కూడా శంఖ చక్ర గదా శార్ఙ్గాలున్నాయనీ కృష్ణుడితో సమానుడివి కాబోవు. నవ్వుల పాలైపోగలవు. నీ మదం అణచటానికి అతను కూడా ఎదురు చూస్తూనే ఉంటాడు," అన్నాడు.

పౌండ్రుడు బిగ్గిరిగా నవ్వి, "నువ్వన్నది కాదంటే కోప్పడతావు, శపిస్తావు. అందుచేత ఏమన్నా అనాలంటే మా బోటి వాళ్లం

## 23. పౌండ్రవాసుదేవుడి వధ



భయపడతాం. ఈ మాటలే మరొకడంటే బతకనిచ్చేవాణ్ణా? నీతో వాగ్వాదానికి నాకు తీరిక లేదు. నీ నోటితోనే నన్ను మెచ్చుకునే రోజు వస్తుందిలే. ఇంక దయచెయ్యి," అని చెప్పాడు.

నారదుడు పౌండ్రుడితో ఏమీ అనక తిన్నగా బదరికాశ్రమానికి వెళ్ళి, అక్కడ ఉన్న కృష్ణుడితో పౌండ్రుడి యుద్ధ సన్నాహం గురించి చెప్పి తన దారిన తాను వెళ్ళిపోయాడు.

ఆ రాత్రే పౌండ్రుడు ప్రచండమైన సేనతో బయలుదేరి ద్వారకను ముట్టడించబోయాడు. కొన్నివేల దివిటీలతో అతని



సేన ద్వారకయొక్క తూర్పు ద్వారం వద్ద చేరింది. వాళ్ళు ఆ అపరాత్రివేళ దిక్కులు బద్దలయేలాగా భేరీలూ, కాహళులూ మోగించారు.

యాదవులు తగు జాగ్రత్తలోనే ఉన్నారు. రాత్రివేళల కూడా ద్వారకానగరం దివిటీలతో పగటి వేళ ఉన్నంత ప్రకాశవంతంగానూ ఉంటున్నది. పౌండ్రుడి రాకకు ఏ మాత్రమూ కంగారు పడక యాదవులు అతి శీఘ్రంగా తమ సేనలను యుద్ధానికి ఆయత్తపరిచారు. తరవాత ఉగ్రసేనుడూ, బలరాముడూ, సాత్యకీ, కృతవర్మా ముందుండి, సైన్యాల్ని వెంట బెట్టుకుని వచ్చి పౌండ్రుడి సేనలతో మహాదారుణమైన యుద్ధం ప్రారంభించారు. ఉభయ పక్షాలా ఏనుగులూ, గుర్రాలూ, రథాలూ నాశనం కాసాగాయి.

ఒక వంక సంకుల సమరం సాగుతూంటే, పౌండ్రుడి పక్షానికి చెందిన ఏకలవ్యుడనే వాడు తన పేరు చెప్పుకుని సాత్యకినీ, కృతవర్మనూ, బలరాముణ్ణీ, కృష్ణుణ్ణీ పేర్లు పెట్టి పిలిచి యుద్ధానికి సవాలు చేశాడు. యాదవవీరులు అతనికి ఎదురు రాగా అందరినీ బాణాలతో కొట్టాడు. దివిటీలవాళ్ళు దివిటీలు పారేసి పారి



పోయారు. యుద్ధరంగం అంతా చీకటి అయింది. పౌండ్రుడు తాను గెలిచానే అను కున్నాడు. "కోట గోడలు ఎక్కండి, ధ్వజాలు విరగ గొట్టండి, నగరం ఆక్రమిం చండి!" అని పౌండ్రుడు కేకలు పెడు తూంటే అతని సేనలో ఉత్సాహమూ, కోలాహలమూ జాస్తిఅయాయి.

ఈ పరిస్థితి చూసి సాత్యకికి మండి పోయింది. కృష్ణుడు నగర రక్షణ భారం తన మీద పెట్టి వెళ్ళాడు. కృష్ణుడు లేని కారణం చేతనే శత్రువు లింతగా విజృం భించారనే మాట వస్తుంది. అందుచేత అతను తన పక్షానికి చెందిన యోధులను ఉత్తేజపరుస్తూ, "నేనీ శత్రువులను ఎలా నిర్మూలించబోతున్నానో చూడండి. నగరం రక్షించే భారం మన అందరి పైనా ఉన్న దన్న సంగతి మరిచారా?" అన్నాడు.

ఇలా అంటూనే సాత్యకి అగ్నేయాస్త్రం ప్రయోగించాడు. దానితో కోట నాలుగు పక్కలా మంటలు పుట్టుకొచ్చాయి. కోట గోడలు ఎగబాకే ప్రయత్నంలో ఉన్న సైని కులు పారిపోయారు. సాత్యకి వారిని తరుము కుంటూ వెళ్ళి, "రాజైపుట్టి, రాచమర్యాద కూడా తెలియకుండా, అర్ధ రాత్రి వేళ అందరూ నిద్రపోయే సమయంలో దొంగ లాగా యుద్ధానికి వచ్చిన ఆ నీచు డెక్కడ?





నేను అతనితో యుద్ధానికి వచ్చాను," అని కేక పెట్టాడు.

ఈ కేక విని యుద్ధసన్నద్ధుడై ఉన్న పౌండ్రుడు ముందరికి వచ్చి, "ఓయీ, సాత్యకీ, నువు యుద్ధానికి వచ్చావు, బాగానే ఉన్నది. కాని ఆ కృష్ణు డెక్కడ? అత గాడు ఆవులను తోలుకోక పెద్ద యోధుడ నని తిరుగుతున్నా డేమిటి? నా సంగతి ఎరగడా? స్త్రీలనూ, గొడ్లనూ సంహరించే వాడు నా పేరు తగిలించుకుంటే ఏమైనా నప్పుతుందా? ఆ కృష్ణుడు నా మిత్రుణ్ణి నరకుణ్ణి చంపాడు. అందుచేత అతన్ని యుద్ధంలో కడతేర్చ వచ్చాను. నీతో యుద్ధం చెయ్యటం నాకు పరువు చేటు. అందుచేత నువు తప్పుకో. కాదంటావా? ఒక్క క్షణంలో నా బాణాలతో నిన్ను పర లోకానికి పంపగలను, చూసుకో! దాంతో మీ గోపాలుడి మదం అణిగి పోతుంది. అతను ఈ గొల్లపల్లె భారమంతా నీ నెత్తిన పెట్టి కైలాస యాత్ర వెళ్ళాడని తెలుస్తు న్నది. వచ్చాక అతని సంగతి చూస్తాం. ప్రస్తుతానికి అతనికి సంతోషం కలిగేటట్టుగా చావటమే నీ ధర్మం," అన్నాడు.

ఇద్దరూ ఇదే ధోరణిలో బీరాలు పలికి యుద్ధానికి దిగారు. ఇద్దరూ బాణాలతో పర స్పరం క్రూరంగా హింసించుకున్నారు; ఒకరినొకరు మూర్ఛ పోగొట్టారు; ఒకరి రథా లొకరు ధ్వంసం చేశారు; ఒకరి బాణా లొకరు విరగగొట్టారు: ఇద్దరూ గదాయుద్ధం చేశారు; చివరకు ముష్టియుద్ధం కూడా చేశారు. ఇద్దరూ సమ బలులుగా కనిపిం చారు. చస్తే ఇద్దరూ చస్తారు గాని, ఒకరిని మరొకరు చంపి, గెలవటం సాధ్యం కాదని చూసే వారికి అనిపించింది. చివరకు ఉభయపక్షాల యోధులూ వారి యుద్ధానికి అడ్డం తగిలి, వారిని విడదీశారు.

తరవాత ఏకలవ్యుడూ, బలరాముడూ ద్వంద్వ యుద్ధం చేశారు. ఆ యుద్ధంలో



బలరాముడు ఏకలవ్యుణ్ణి మూర్ఛపోగొట్టి, తన హలాయుధంతో శత్రుసైన్యాన్ని చించి చెండాడాడు.

ఇంతలో స్పృహ తెలిసి ఏకలవ్యుడు తిరిగి బలరాముడి పైన కలియ బడ్డాడు. వారు భయంకరంగా యుద్ధం చేస్తూండ గానే తూర్పు తెల్లవారింది.

అప్పుడు పౌండ్రుడు తన సేనలను యుద్ధం నిలపమని హెచ్చరిస్తూ, "మనం ఎంత మందిని చంపి ఏమి లాభం? అసలు శత్రువు లేడు. అందుచేత ఈ యుద్ధం నిరర్థకం. కృష్ణుడు వచ్చాక మన పరాక్రమం చూపుదాం. ఈ క్షుద్రుల మీద మన ప్రతాపం చూపే దేమిటి?" అన్నాడు.

వెంటనే పౌండ్రుడి సేనలు యుద్ధం మాని వెనక్కు తగ్గాయి. పౌండ్రుడు తన సేనలను వెంటబెట్టుకుని, తన మిత్రుడైన కాశీరాజు వద్దకు వెళ్ళిపోయాడు. కృష్ణుడి రాకకు ఎదురుచూస్తూ అతను అక్కడే ఉండిపోయాడు.

ద్వారకలో యాదవులు తమకు విజయం లభించినట్టు తూర్యనాదాలు చేసి, నగరం లోపలికి వెళ్ళిపోయారు. కృష్ణుడి మాట నిలబెట్ట గలిగినందుకు వారు చాలా సంతోషించారు.



ఇంతలో కృష్ణుడు ఆకాశమార్గాన వారికి కనిపించాడు. అతను నగరం బయట గరుడవాహనం దిగి, దారుకుడు తెచ్చిన రథ మెక్కి, ద్వారకలోకి వచ్చాడు. పన్నెండేళ్ళ అనంతరం కనిపించిన కృష్ణుణ్ణి చూసి యాదవు లెంతో సంతోషించారు. కృష్ణుడు తన కైలాసయాత్ర వివరాలన్నీ చెప్పి, పౌండ్రుడు చేసి వెళ్ళిన యుద్ధం గురించి విన్నాడు.

కృష్ణుడు ద్వారకకు తిరిగి వచ్చాడని తెలిసి, కాశీలో ఉన్న పౌండ్రుడు ఒక దూత ద్వారా ద్వారకలో ఉన్న కృష్ణుడికి ఇలా సందేశం పంపాడు:





"గోవుల మధ్య పుట్టి పెరిగిన నీకు ధర్మం తెలీదు. స్త్రీలనూ, మృగాలనూ, బంధువులనూ వధించటంతో ఊరుకోక, నా పేరూ, నా చిహ్నాలూ కూడా ధరించావు. ఏ విధంగానూ నువు నన్ను పోలవు. నీకు బతికి ఉండాలన్న కోరిక ఉంటే, నా ఆజ్ఞ ప్రకారం చక్రం మొదలైన ఆయుధాలు విసర్జించు; నా పేరు పెట్టుకోవటం మాని, వచ్చి నన్ను శరణువేడు."

పౌండ్రుడి మాటలుగా దూత ఇలా చెప్పగా కృష్ణుడు నవ్వి, "మీ రాజు చెప్పి నట్టే చేస్తాను. నన్ను రమ్మన్నాడు గనక వస్తాను; చక్రం మొదలైనవి విడవమన్నాడు



గనక అతని మీదనే విడుస్తాను. తన శరణం వేడమన్నాడు గనక, అతని శరణం (వధ) చూస్తాను. గొప్పవాడి మాట తీసి వెయ్యటం బాగుండదు," అని దూతను గొప్పగా సత్కరించి పంపేశాడు.

తన దూత తెచ్చిన సందేశం వినగానే పౌండ్రుడు కాశీనగరం వెలపల తన తోటి రాజులతోనూ, సైన్యాలతోనూ సన్నద్ధుడై కృష్ణుడి రాక కోసం ఎదురు చూడసాగాడు.

కృష్ణుడు బయలుదేరుతూంటే సాత్యకి మొదలైన వాళ్ళు కూడా సైన్యాలతో బయలుదేరబోయారు. కాని కృష్ణుడు వారిని వారించి, "యుద్ధంలో మీ వంతు గెలుపు మీరు పొందారు. ఈ సారి నా వంతు," అని చెప్పాడు.

అతను గరుడవాహనం మీద బయలు దేరి పౌండ్రుడున్న చోటికి చేరాడు. ఇద్దరు వాసుదేవులూ ఒకరి కొకరు ఎదురు నిల్చారు. కృష్ణుడు పౌండ్రుడితో, "పౌండ్రరాజా, నీకు నా లాంఛనాలన్నిటినీ ధరించాలని కోరిక ఉన్నట్టయితే నన్ను వేడుకుంటే నేను సమ్మతించక పోయానా? ఎందు కింత మతిమాలిన పని చేశావు? ఇప్పుడైనా మించి పోలేదు, నన్ను వేడుకుంటే నేను నిన్ను కాస్తాను. నేను శరణాగత త్రాణపరా



యముణ్ణి. నా చక్రంతో నరకుడి లాగా ఎందరో చచ్చారు. ఇక్కడ ఉన్న వారిలో ఒక్కడూ నిన్ను రక్షించ లేడు. నీ మేలు కోరి హితం చెప్పాను," అన్నాడు.

"నా లాంఛనాలనే నువు పెట్టుకున్నావు. అందుకు నిన్ను శిక్షించటానికే నేను వచ్చాను. నా రాక తెలిసి కొంతకాలం కైలాసంలో దాక్కున్నావు. నువు లేవని తెలిసి నీ నగరాన్ని నేల మట్టం చెయ్యక వదిలాను. నువు రావటం మంచిదయింది. నీ కోసం యముడు కాచుకుని ఉన్నాడు," అన్నాడు పౌండ్రుడు.

ఇద్దరూ యుద్ధానికి ఉపక్రమించారు. కృష్ణుడు వరసగా పౌండ్రుడి ఆయుధాలన్నీ నిర్మూలించి, తన చక్రాయుధంతో పౌండ్రుణ్ణి కడతేర్చాడు.

తన ఆప్తమిత్రుడైన పౌండ్రుడు చచ్చాడన్న రోషంతో కాశీరాజు కృష్ణుడితో యుద్ధానికి తలపడ్డాడు. కృష్ణుడు ఒక అస్త్రంతో కాశీరాజు తల తెగనరికాడు. ఆ తల వెళ్ళి కాశీనగరం మధ్యన పడింది.

ఈ విధంగా కృష్ణుడు తాను వచ్చిన పని ముగించి ద్వారకకు తిరిగి వెళ్ళాడు.

కాశీరాజు కొడుకు తన తండ్రి చావుకు దుఃఖించి, తమ పురోహితుడి చేత అగ్ని హోత్రం చేయించగా దక్షిణాగ్నియందు కృత్య అనే భయంకర పిశాచి ఆవిర్భవించి, "ఏమి ఆజ్ఞ?" అని అడిగింది. కృష్ణుణ్ణీ, అతని వాళ్ళనూ చంపి రమ్మని కాశీరాజు కొడుకు దాన్ని కోరాడు. కృత్య ద్వారకకు వచ్చింది. ద్వారకావాసులు దాన్ని చూసి భయపడి కృష్ణుడితో చెప్పారు. కృష్ణుడు తన సుదర్శనచక్రాన్ని దాని మీదికి వదిలాడు. కృత్య తిరిగి కాశీకి పారిపోతుంటే చక్రం దాన్ని వెన్నంటి వెళ్ళింది. కృత్య కాశీనగరంలో ప్రవేశించగానే సుదర్శనచక్రం కృత్యతోబాటు కాశీనగరాన్ని కూడా పూర్తిగా నిర్మూలించేసింది.





# అరణ్యపురాణం

## 26

మౌగ్లీకి జీవితం మహా ఉల్లాసంగా గడిచి పోతున్నది. అరణ్యంలో అందరూ అతనికి మిత్రులే. వారికి అతనంటే అభిమానంతో బాటు కొద్దిపాటి భయంకూడా లేక పోలేదు. అతను అరణ్యంలో వివిధ ప్రాంతాలకు వెళ్ళేటప్పుడు అతని నలుగురు అన్నలూ వెంట ఉంటే ఉండేవారు, లేకపోతే ఒంటరి గానే తిరిగేవాడు. అతన్ని గురించి ఎన్ని కథలైనా చెప్పుకోవచ్చు. వాటిలో ఇప్పుడు చెప్పబోయేది ఒకటి.

తోడేలయ్యా, తోడేలమ్మా పోయారు. వాళ్ళు ఉంటూ వచ్చిన గుహకు మౌగ్లీ ఒక పెద్ద కొండరాయిని తీసుకు వచ్చి అడ్డం పెట్టేశాడు. తరవాత వారి మీద చావు పాట పాడేశాడు.

బాలూ చాలా వృద్ధుడై పోయాడు. అతని కీళ్ళలో ఇప్పుడు పట్టులేదు.

ఉక్కునరాలూ, ఇనప కండరాలూ కలిగిన బాఘీర కూడా ఇప్పుడు వేట మీదికి వెనకటంత వేగంగా లంఘించలేక పోతున్నాడు.

అకేలా పండు ముసలి. అతని శరీరం తెల్లగా నెరిసిపోయింది. అతని డొక్క ఎముకలు వెళ్ళుకొచ్చాయి. కొయ్యకాళ్ళతో నడిచినట్టు నడుస్తున్నాడు. అతని ఆహారాన్ని మౌగ్లీయే సంపాదించి పెడుతున్నాడు.

సియోనీ తోడేళ్ళ మంద విచ్ఛిత్తి అయి పోయింది. ఆ మంద తాలూకు రెండోతరం వాళ్ళు అయిదేళ్ళ వయసులో సంపూర్ణ జవ సత్వాలు కలిగి ఉన్నప్పుడు, ఆ తరానికి చెందిన సుమారు నలభై మంది తోడేళ్ళూ మరొక నాయకుణ్ణి ఎన్నుకుంటే బాగుంటుం దని అకేలా సలహా ఇచ్చాడు. మంద నాయ కత్వానికి జరిగిన పోటీలో ఫావో నెగ్గాడు.

అట్ట చివరి బొమ్మ





చూడండి!" అన్న హెచ్చరికలు వినిపించి నప్పుడల్లా మౌగ్లీ శరీరం పులకించేది. ఆ సమా వేశాలకు అతను విధిగా హాజరయేవాడు.

ఒకనాడు చీకటి పడేవేళ మౌగ్లీ ఒక దుప్పిని చంపి, దాని అర్ధభాగాన్ని అకేలా కోసం తీసుకుపోతూండగా ఒక వింత కేక వినపడింది. షేర్‌ఖాన్ గతించినాక అలాటి కేక మౌగ్లీకి వినిపించనే లేదు. పులివెకనగా వేటాడుతూ పోయే నక్కలు అలాటి కర్ణ కఠోరమైన కేక పెడతాయి. అందులో ద్వేషమూ, విజయగర్వమూ, భయమూ, నిస్పృహా, ఒక విధమైన వెటకారమూ మిశ్రమంగా ధ్వనిస్తాయి. వాయిన్ గంగ అవతలి ప్రాంతం నుంచి అలాటి కేక వినవచ్చింది.

ఆ కేకను మౌగ్లీతోబాటు, అతని వెనకనే గెంతుకుంటూ, ఆడుతూ, పాడుతూ నడిచే అతని అన్నలు కూడా విన్నారు. వారు చట్టున ఆగిపోయారు. వారి రోమాలు నిక్క బొడుచుకున్నాయి. వారు గుర్రుమన్నారు. అప్రయత్నంగా మౌగ్లీ చెయ్యి కత్తి మీదికి పోయింది. అతని కళ్ళు ఎరుపెక్కాయి. అతను కనుబొమలు ముడేస్తూ, "ఇక్కడ వేటాడ సాహసించే చారల వా డెవడూ లేడే!" అన్నాడు.

తిరిగి కొండమీద సమావేశాలు జరిగాయి. తనకేమీ సంబంధం లేకపోయినా మౌగ్లీ వాటికి హాజరై, ఫావోకు ఎగువన ఎత్తుగా ఉండే రాతిమీద అకేలా సరసన కూర్చుంటూ ఉండేవాడు. అతనెప్పుడైనా మాట్లాడటం ప్రారంభిస్తే అతని ప్రసంగం పూర్తి అయినదాకా అందరూ నిశ్శబ్దంగా ఉండి వినేవారు.

ఆ రోజులలో వేటకూ, నిద్రకూ ఎలాటి విఘాతమూ ఉండేది కాదు. పైవాళ్ళెవరూ "మౌగ్లీ జనం" ఉండే ప్రాంతంలో అడుగు పెట్టేవాళ్ళు కారు. సమావేశంలో తోడేలు కూనలను తెచ్చి, "చూడండి! బాగా



"ఇది చారలవాడి కేకకాదు. భారీఎత్తున పథ జరుగుతున్నది. శ్రద్ధగా విను!" అన్నాడు పెద్దన్న.

ఆ కేక మళ్ళీ వినిపించింది. మౌగ్లీ గట్టిగా ఊపిరితీసి సమావేశం జరిగే గుట్ట వద్దకు పరిగెత్తాడు. మందతోడేళ్ళు చాలా మంది అటుకేసే పరిగెత్తుతున్నారు. మౌగ్లీ గుట్ట చేరేసరికి ఫావో, అకేలాలు అక్కడ ఉన్నారు. చాల మంది తోడేళ్ళు వారిచుట్టూ కూర్చుని ఉన్నారు. స్త్రీలూ, పసిపిల్లలూ మాత్రం తమ ఇళ్ళకేసి వేగంగా పరిగెత్తు తున్నారు. ఇలాంటప్పుడు వాళ్ళు బయట ఉండటం క్షేమంకాదు.

వాయిన్ గంగ గలగలలూ, సాయం కాలపు గాలికి చెట్లు చేసే కలకలమూ తప్ప మరేమీ ఆ చీకటిలో వినరావటం లేదు. కాని అంతలోనే నది అవతలి పక్కనుంచి తోడేలు పిలుపు వినబడింది.

ఆ తోడేలు మందలో తోడేలు కాదు. మందకు చెందిన వాళ్ళంతా గుట్ట మీద సమావేశమై ఉన్నారు.

"పిశాచాలు! పిశాచాలు!" అంటూ ఒక బక్క చిక్కిన పెద్దతోడేలు, ఒక కాలు కుంటుతూ, గుట్టనెక్కి వచ్చి, మౌగ్లీముందు సాష్టాంగ పడిపోయాడు. అతడి నోట నురుగు



వస్తున్నది. అతని పక్కలు బాగా రక్తసిక్తమై ఉన్నాయి. "వేటసాగాలి! మీ నాయకు డెవరు?" అని ఫావో గంభీరంగా అడిగాడు.

"వేటసాగాలి! నేను ఏకాకిని," అన్నాడు కొత్త తోడేలు. అంటే అతను ఏమందకూ చెందక, ఒంటరిగా జీవించే వాడన్నమాట. అతని గుండె అదురుకు శరీరం కంపించి పోవటం స్పష్టంగా కనిపిస్తున్నది.

"ఏమిటి విశేషం?" అని ఫావో అతణ్ణి ప్రశ్నించాడు.

"పిశాచాలు, దక్కను పిశాచాలు— ఎర్రవేట కుక్కలు! దక్కను శూన్య మయిందిట, ఉత్తరంగా వచ్చారు—దారి

పొడుగునా మారణహోమం సాగిస్తూ. ఈ చంద్రుడు మొదట కనిపించిన నాడు నాకొక భార్యా, ముగ్గురు కూనలూ ఉండే వారు. మైదానంలో పిల్లలకు నా సహచారిణి వేట నేర్పుతూ ఉండేది. అర్ధరాత్రివేళ వాళ్ళ వేట తమకపు కేకలు విన్నాను. తెల్లవారేసరికి నలుగురూ శవాలై ఉన్నారు. పగ తీర్చుకోపటానికి బయలుదేరి, పిశాచాలను కళ్ళజూశాను," అన్నాడు ఏకాకి.

"ఎంత మంది?" అని మౌగ్లీ చప్పున అడిగాడు. తోడేళ్ళ మంద కోపంతో గుర్రుమంటున్నది.

"నాకు తెలీదు. వాళ్ళలో ముగ్గురిని ఖర్చు కింద వెయ్యండి. కాని చివరకు వాళ్ళు నన్ను లేడిని తరిమినట్టు తరిమారు. మూడు కాళ్ళ మీద నన్ను పరిగెత్తించారు. చూడండి!" అన్నాడు ఏకాకి, నజ్జు అయిపోయిన తన ముందు కాలును చాస్తూ. దాని మీద రక్తం నల్లగా అట్ట కట్టుకుని ఉన్నది. అతని పక్కలా, కంఠం మీదా కూడా గాట్లున్నాయి.

అకేలా మౌగ్లీ తనకోసం తెచ్చిన ఆహారం ముందు నుంచి లేస్తూ, "తిను," అన్నాడు. ఏకాకి దాని పైకి ఆత్రంగా దూకాడు. అతను తన ఆకలి కాస్త తీర్చుకున్నాక, "మీరు పెట్టిన ఈ తిండి వృథా పోదు. నన్ను కాస్త బలం తెచ్చుకోనిచ్చారంటే నేను కూడా వేటలో కలుస్తాను. నా కుటుంబం పోయింది. నేను ఆ పిశాచాల మీద పగతీర్చుకోవాలి," అన్నాడు.

అతని దవడలు ఎముకలు కొరకటం ఆలకించి ఫావో, "ఆలాటి దవడలతో అవసరం ఉంది. పిశాచాల వెంబడి కూనలు కూడా ఉన్నారా?" అని అడిగాడు.

"లేదు. లేదు. అందరూ ఎర్ర వేటగాళ్లే. పూర్తిగా పెరిగినవాళ్ళు. దక్కనులో తొండలను తినేవాళ్ళే అయినా పలంగానూ, బలంగానూ ఉన్నారు," అన్నాడు ఏకాకి.



# 80. మృతనగరం - సెంట్‌పియర్

వెస్ట్ ఇండీస్ దీవులలో ఒకటి అయిన మార్టినిక్ (ఫ్రెంచివలస) మీద ఉండే అగ్నిపర్వతం, 1902 మే 8 ఉదయం 7-50 కి ఉపద్రవంగా పేలింది. దాని పేలుడు ధ్వని అనేకవందల మైళ్ళ దూరానికి వినిపించింది. మూడునిమిషాల లోపల సెంట్‌పియర్ నగరం అగ్నిపర్వతపు ధూళిలో మునిగి హతమారి పోయింది. నగరంలోని 30 వేలమంది జనాభాలో ఒకే ఒకడు ప్రాణాలతో బయట పడ్డాడు. నగరపు రేవులో ఉండిన 18 ఓడలలో కూడా ఒక్కటే నాశనం కాకుండా మిగిలిపోయింది. సెంట్‌పియర్ నగరాన్ని దరిమిలా పునర్నిర్మించారు. ఈ నగరం రెండున్నర శతాబ్దాలపాటు వ్యాపారానికి కేంద్రంగా వున్నది, సంస్కృతికి పేరు మోసినది. కాని ఈనాడది నిద్రాణంగా ఉన్నది.



Chandamama, July '68

Photo by Prasad



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఒకరి కొకరు

పంపినవారు :
టి. యశోదారాణి, శ్రీకాకుళం

Photo by Bhalchandra Kadne



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఎవరికి వారు

పంపినవారు:
టి. యశోదారాణి, శ్రీకాకుళం

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1968 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగాని కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూలై నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఒకరి కొకరు

రెండవ ఫోటో: ఎవరికి వారు

పంపినవారు: తిరుమలశెట్టి యశోదారాణి,

శ్రీకాకుళం. (కృష్ణాజిల్లా)

బహుమతి మొత్తం రు. 10/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

ఊహా! నాకు ఇష్టమైనవి



ఈ రుచికర మయిన దౌరలా మిఠాయి!







దౌరలా మిఠాయి...
ఎల్లరకు ప్రియమైనది!

అడిగిన:

ఇంపీరియల్ టాఫీస్, ఫ్రూట్ టాఫీస్, గోల్డెన్ క్రిస్ప్స్,
మిక్స్డు ఫ్రూట్ డ్రాప్స్ దౌరలా బోన్ బోన్,
లోలీ పాప్స్, ఏమ్టో లిక్కర్.

A DCM PRODUCT

DSW 412 TL

